MISIMI/ మిసిమి RNI Regd. No. 45042/90 Telugu Monthly, Hyderabad - 500 020. Postal Regd No. H/SD/191



"Girl with a pearl earring", c. 1665-66, oil on canvas.
(Staatliche Museen zu Berlin, Germaldegalerico)

## రచయితలకు మనవి

కలం ఆగితే సర్జక స్రవంతి ఇంకిపోయినట్లే.
అదే జరిగితే సృష్టే ఆగిపోతుంది.
స్రవంతిని నిరంతరం జాలు వారనీయండి.
మీ స్రవంతికి మిసిమిని మాధ్యమం కానివ్వండి.
మీ సృజనా స్రవంతిలో రసాస్వాదులను
రసహృదయులను మునకలు వేయనీయండి.

*- మిసిమికి రచనలు పంపండి.*

## చందాదారులకు విజ్ఞప్తి

చందాల కాలపరిమితి పూర్తి అయిన
చందాదారులు తమ చందాలను పునర్నవీకరణం
చేయించుకొని మిసిమి నిరంతరాయ సరఫరాకు
తోడ్పడవలసిందిగా కోరుతున్నాం.

# మిసిమి

**"All that we are is the product of what we have thought" is "We are what we think." — Dammapada.**

సంపుటి 8 ఆగస్టు 1996 సంచిక 7

వ్యవస్థాపక సంపాదకుడు : డాక్టర్ **రవీంద్రనాథ్ ఆలపాటి**

## విషయసూచిక



ముఖచిత్రం : **ది లోన్‌లీ లేడీ - గులెర్** (చండీఘర్ మ్యూజియం)

విడిప్రతి రూ. 6/- వార్షిక చందా రూ. 70/-

Printed, Published by BAPANNA ALAPATI at Kala Jyothi Process Ltd., 1-1-60/5, R.T.C. X Roads, Musheerabad, Hyd-20. Ph. 7612436, 7612337.

సంపాదకుడు : **అన్నపరెడ్డి వెంకటేశ్వర రెడ్డి**

# PROBLEMS IN COMMUNICATION

*- Mohammed Elias*

For instance, women typically tend to say "we" instead of "I" as an aggressive male would taking personal responsibility. Words like "just" and "only" should be avoided when unnecessary. "I just wanted to know if . It's only a minor point, but .. Equally bad are tag questions like "I think it's a real money-maker, don't you?" These expressions make the woman sound insecure and a man may assume she is seeking his approval This reduces effectiveness in putting across her views forcefully

Verbal nudges like "yes" and "uh-huh" are generally used by women to encourage the other speaker to continue, and express ideas without restraint But men tend to interpret them literally as agreement or acquiescence In such cases, noncommittal expressions like "go on" or "let me think about that" should be used

Some women are so fanatical in their hypercorrectness that they often make their male colleagues uncomfortable. Natural coversational style differs from formal English Splitting infinitives and ending sentences with prepositions sound spontaneous and informal This helps in breaking the ice and getting negotiations on the fast track.

In spoken English, and perhaps in most other languages as well, direct statements are believed to communicate truth. Policemen confront a suspect with a blunt accusation and see if the response is a flat denial. An evasive counter-question like "Who, me?" indicate as guilty conscience

In some languages and cultures, women and, perhaps men as well, may not be judged so categorically But you have to look up and speak up, if you want to be properly understood in English

# సాహితీ విమర్శలో విఘటన వాదం

– సీతారాం

ఆధునిక భాషాశాస్త్రం తోడ్పాటు లేకుండా సాహిత్య విమర్శ ముందుకు పోలేదనే అవగాహన ఇటీవలి పరిణామం. అదే విధంగా సాహిత్య విమర్శ ఆధునిక భాషా శాస్త్ర పరిశోధనల మీద ఆధారపడి సాగించటం ఒక పద్ధతిగా ముందుకొచ్చింది. సాహిత్యంతో ఏ మాత్రం సంబంధం లేని అంశంగా పరిగణించ బడిన భాషాశాస్త్ర ప్రాధాన్యం విమర్శకు, విమర్శనా పద్ధతులకు ఉపయుక్తం కావటం సాహిత్య విమర్శలో ఒక ముఖ్య మలుపు ఈ మలుపులోనే De - Construction అనేది కూడా ఒక ధోరణిగా ప్రచారంలోకి వచ్చింది. దీని ప్రారంభం 1970 ప్రాంతాలు. కళా రచనలో మరీ ముఖ్యంగా సాహిత్య కళా రచనలో, భాషా వ్యవస్థే మాట్లాడుతుంది. కాని, ఆ రచనను అందించిన లేదా సృష్టించిన రచయిత మాట్లాడడు అనటంతోనే De - Construction వివాదాస్పదమైంది ఈ విధంగా భావించటంతో విమర్శకుడికి వాచకం (Text) తప్ప మరొక విషయంతో నిమిత్తత లేకుండా పోయింది.

వాచకం అంటే రచయిత కూర్చేది. నిర్మించేది అనుకున్నా ఫర్వాలేదు. రచయిత నిర్మించి యిచ్చే వాచకం భాషా వ్యవస్థకు వెలుపల నుంచి జరిగే పని కాదు. భాషా వ్యవస్థ ద్వారా తప్ప ఇతరత్రా జరగదు. అందువల్ల విమర్శకుడు అనివార్యంగా భాషా వ్యవస్థను తాకకుండా తప్పించుకోలేడు. సాహిత్య విమర్శలోకి భాషా వ్యవస్థ చొచ్చుకొచ్చి కీలక పాత్ర వహించటం మొదలు పెట్టాక మిగిలినవి అన్నీ క్రమంగా వాటి వాటి ప్రాధాన్యాన్ని కోల్పోయాయి

De - Construction అన్న పదంలో de ఉపసర్గగా వచ్చి చేరటంతో తెలుగులో దీన్నెలా వ్యవహరించాలి అన్నది ముఖ్యమైన సమస్యగా మారింది. పదాల టంకింపులోనూ, పరిభాషా పదాలను ఖాయం (coinage) చేసుకోవటంలోనూ వెనుకబడ్డ మనం దీనిని 'వినిర్మాణ వాదం'గా వ్యవహరించటం మొదలు పెట్టాం. వినడానికి బావుంది. కానీ అర్థంలో తేడా వస్తుంది నిర్మాణం అనే మాటకు 'వి' ని ఉపసర్గగా చేరిస్తే నిర్మాణానికి వ్యతిరేకమైంది అన్న అర్థం రావడం లేదని కొందరి అభిప్రాయపడ్డారు. 'జయం అనే పదానికి 'వి' చేర్చి విజయం అన్నప్పుడు జయానికి వ్యతిరేకమైంది అనే అర్థం రాదు. కానీ Construction కు De అన్న Prefix చేరిస్తే నిర్మాణానికి పూర్తి విరుద్ధమైన అర్థాన్నిస్తోంది. తెలుగులో వినిర్మాణం అనే మాట పొసగదు. కాబట్టి అనిర్మాణం అందామంటే కృతకంగా ఉన్నట్లనిపిస్తుంది. పైగా అంత ఇంపుగానూ అనిపించదు. తేలికైన పనేమిటంటే విఘటన వాదం అని పిలవవచ్చు. అలవాటులోకి వచ్చేదాకా ఇట్లా వ్యవహరించడం కొంత ఇబ్బందిని కలిగిస్తుంది. ఎబ్బెట్టుగా ఉండటం కన్నా, యివ్వాల్సిన అర్థఛాయని కాక అనర్థాన్ని కలిగించటం కన్నా యిది కొంతమేరకు నయం.

ఇంతకీ ఈ విఘటన వాదం (ఘటనం లేనిది కాదు. ఘటనమే ఉండదు లేదు అని చెప్పేవాదంగా స్వీకరించాలి) ఏం చెపుతుంది? దీనికి ఆద్యులెవరు? లాంటి ప్రశ్నలు వస్తాయి. 1970ల నాటికి అత్యంత వివాదస్పద సాహిత్య విమర్శ సిద్ధాంతంగా ముందుకొచ్చింది. దీనికి పూర్వం 1940 లలో అభినవ విమర్శ, తరువాత నిర్మాణవాదం ( స్ట్రక్చరలిజం) మొదలైన వాదాల్లాగే యిది కూడా విమర్శోద్యమాన్ని ప్రభావితం చేసింది దీనికి అద్యుడిగా జాక్స్‌డెరిడాను

గుర్తిస్తున్నారు. జాక్స్‌డెరిడా తాత్త్వికుడు, విమర్శకుడు కూడా ఈయన సిద్ధాంతం దృష్ట్యా సాహిత్య రచన ఏదైనా అది చెప్పాలనుకున్న దానిని నిర్దిష్టంగా చెప్పలేదు. కనుక, సాహిత్య విమర్శకుడు సాహిత్య రచన దేనిని ఆవిష్కరించాలనుకుని విఫలమైందో దానిని చెప్పాలి. మరో మాటలో చెపితే సాహిత్య రచన దేనిని వ్యక్తం చేయాలనుకుని వ్యక్తీకరించలేక పోయిందో దాన్ని విఘటించాలి. (యిక్కడ విఘటనం అంటే ఘటించడం అనే తప్ప మరొకటిగా అర్థం చేసుకునే పనిలేదు) అంటే సాహిత్య రచన చెప్పలేక పోయిన దాన్ని పునః సృష్టించాలి అంటుంది. ఈ క్రమంలో ఆ రచనలోని పదాలను వాటి అర్థాల యొక్క బాహ్య రూపంగా కాకుండా వాటి అర్థాలను వెలికి తీసే ఒక అన్వేషణగానే స్వీకరించాలని చెపుతుంది. రచనలో ఉండే పదాలు వాటి అర్థాలను నిర్ధారించేవి కావు. అర్థాన్ని వెతికేందుకు ఉపకరించే జాడలు మాత్రమే. అంటే అర్థం అన్వేషించబడుతూ పోవటమే తప్ప, రచయిత చెప్పదలచింది ఇది అనిగాని, చెప్పిన అర్థం ఫలానా అనిగానీ విమర్శకుడు నిర్ధారించే వీలు లేదని వాదిస్తుంది విఘటన వాద విమర్శ.

జాక్స్‌డెరిడా సాగించిన అధ్యయనాలన్నీ ఇలాంటివే ఆయన పశ్చిమ దేశాల తత్త్వశాస్త్ర చరిత్రకు చెందిన వాచకాల పరంపరను పై పద్ధతిలోనే చదివాడు ప్లేటో మొదలుకొని డెకార్టె, రూసో, హెగెల్ నుంచి హుసెర్ల్ హెడెగర్లనూ పఠించాడు మరీ ఇటీవలిపైన నిర్మితివాద చరిత్రకు సంబంధించిన వాచకాలను అనుశీలించాడు. భాషా శాస్త్రవేత్త అయిన సజూర్‌తో పాటుగా లెవిస్ట్రాస్, లాకన్, ఫోకో మొదలయిన వారి రచనలను కూడా నిశితంగానే చదివాడు. అయితే నిర్మితి మానవశాస్త్రం (స్ట్రక్చరల్ ఆంత్రోపాలజీ) క్లాడ్ - లెవిస్ట్రాస్ అధ్యయనం, తత్ప్రతిపాదనలకు ప్రతి చర్యగా నిర్మాణ రహిత సిద్ధాంతాన్ని రూపొందించాడనేది విమర్శకాభిప్రాయం ఒక్క మాటలో చెపితే నిర్మాణ వాదం నుంచి పైదొలగి, నిర్మితి వాద తర్కానికి వ్యతిరేకంగా సాగించిన సమాలోచన ఫలితమే డెరిడా రూపు దిద్దిన 'డి-కన్‌స్ట్రక్షన్' అని మరికొందరి అభిప్రాయం.

డెరిడా ప్రతిపాదిత సిద్ధాంతాన్ని ఒక మేరకు అర్థం చేసుకునేందుకు భాష ఒక కీలక సాధనంగా ఉపయోగపడుతుంది కేవలం భాష ఒక్కటే కాకుండా నిర్మితి వాద భాషాశాస్త్ర వేత్త అయిన సజూర్ (sassure) భాషాశాస్త్ర విషయంగా చేసిన ప్రతి పాదనల నేపథ్యంలోంచి కూడా కొంత అవగతం చేసుకోవచ్చు. సజూర్ భాషాశాస్త్రంలో ప్రతి పాదించిన వాటికి విరుద్ధంగా డెరిడా ఆలోచన సాగింది కనుక ఈ అవసరం ఏర్పడుతున్నది.

''భావాలను అభివ్యక్తీకరించే సంకేతాల వ్యవస్థే భాష'' సజూర్ చేసిన ప్రతిపాదన. యిది తొలిమెట్టు మాత్రమే అయితే భాషా సంకేతాలు యాదృచ్ఛికమే నంటాడు సజూర్ సంకేతాలు యాదృచ్ఛిక స్వభావాన్ని ప్రదర్శిస్తాయనడానికి మనకు బోలెడు ఆధారాలున్నాయి. సంకేతాలు అన్ని భాషల్లోనూ ఒకే మాదిరిగా ఉండవు. భాషనుంచి మరో భాషకు సంకేతాలు మారుతుంటాయి. ఒకే వస్తువుని సూచించించేదుకు భిన్న భాషల్లో విభిన్న సంకేతాలున్నాయని మనం ముందుగా గుర్తించాలి ఈ వాస్తవం ఆధారంగానే సంకేతాలు యాదృచ్ఛికమైనవిగా మనం

ం.

భాషా సంకేతం యాదృచ్ఛికమేనని సజూర్ నిర్ధారించక ముందే ఒకరిద్దరు విమర్శకులు సంకేతానికుండే యాదృచ్ఛికతను పసిగట్టారు. వారిలో అరిస్టాటిల్, కోల్రిడ్జులు ముఖ్యులు.

కోల్రిడ్జ్ దృక్పథం రీత్యా 'Sun' అనే శబ్దంగానీ, S U.N. అనే వర్ణాలుగానీ నిర్ద్వంద్వంగా ఆవస్తువుని చెప్పే యాదృచ్ఛిక విధానాలు మాత్రమే సజూర్ భాషకు ఉండే సూచనాత్మక లేదా సంబంధాత్మక స్థితిని సవాలు చేయడం ద్వారా తనకు పూర్వం ఉన్నవారి ఆలోచనలతో విభేదించాడు సజూర్ ప్రకారం భాషా సంకేతాలు బాహ్య వస్తువులను సూచించేవి కావు. అవి పరస్పర సూచనాత్మకాలు కాబట్టి భాష referential కాదు Self referential అంటాడు. మన సౌలభ్యం కోసం దీనిని స్వీయ - సూచనాత్మకం లేదా స్వీయ - సంబంధాత్మకం అని వ్యవహరించవచ్చు.

భాషని సంకేతాల వ్యవస్థగా నిర్వచించిన సజూర్ ప్రతి భాషాంశం, సంకేతం (Sign)లో ఒక సంకేతకం (Signifier) ఒక సంకేతితం (Signified) కలిగి ఉంటాయి. ఈ సమస్తాన్ని నిర్దేశించేందుకు సంకేతం (Sign) అని వాడాడు ఇవి మనం ఉత్పత్తి చేసే ధ్వని భావనలకు ప్రాతినిధ్యం వహిస్తుంటాయి అంటే ఒక ధ్వని ప్రతి రూపం, ఒక భావం వీటి సమ్మేళనాన్ని సంకేతం అని పేర్కొన్నాడు ఈ ధ్వని - ప్రతిరూపం, భావం అనే వాటినే సంకేతకం, సంకేతితంగా మార్చాడు. ఈ రెంటినీ మార్చినప్పటికీ సజూర్ 'సంకేతం' అనే దానిని యథాతథంగా వాడాడు. సంకేతం విషయంలో రాజీపడక తప్పలేదని అంగీకరిస్తూ'' బదులుగా ఉపయోగించదగిన మరో శబ్దం కనబడకపోవటం, సాధారణ భాషలో మరో పదం లభ్యం కాకపోవటం'' అని వివరించాడు. వీటి గురించి ఇంతగా నొక్కి చెప్పడానికి కారణం ఏమంటే - సంకేతకం, సంకేతితాల మధ్య ఉండే బంధం యాదృచ్ఛికమైందనే సజూర్ అభిప్రాయపడ్డాడు. కాబట్టి ''సంకేతితంలో సంకేతకానికి ఉన్న సహచారిత ద్వారా సిద్ధించే సమస్తాన్నే నేను సంకేతం అని వ్యవహరిస్తున్నాను క్లుప్తంగా చెపితే భాషా సంకేతం యాదృచ్ఛికమైనది'' అంటాడు సజూర్. ఉదాహరణకు 'కుర్చీ' అనే భాషాంశమే ఉంది ఇది ఒక వస్తువుని లేదా ఆవస్తువుని సూచిస్తున్న కారణంగానే 'కుర్చీ' అన్న భావన రాదు. సరికదా ఈభాషాంశం (Linguistic Unit) ఇతర భాషాంశాలైన ఇల్లు, బల్ల, మేజా మొదలైన వాటితో విభేదిస్తూండటం వల్ల ఆభావన (కుర్చీ) మనకు స్ఫురిస్తుంది. నిత్యవ్యవహారంలో 'కుర్చీ' అనగానే 'కుర్చీ' అనే భావన కలిగేంతగా భాషకి అలవాటు పడిపోయాం. కానీ, ఆ భాషాంశం దానిని సూచినంత మాత్రానే కాదు. అది సూచించే దానిలోనే సూచించనివి ఉండటం, సూచించే దానితో మిగిలినవి విభేదాన్ని కలిగి ఉండటం వల్ల ఇది సాధ్యమవుతుంది. అంటే ప్రతి భాషాంశంలోనూ అది సూచించేది మాత్రమే కాక ఆభాషాంశంలోనూ అనుపస్థిత (Absent) భాషాంశాల చిహ్నాలు కూడా ఉంటాయి. ఒక భాషాంశంలో అది సూచించక వదిలిపెట్టిన లేదా ఆభాషాంశంలో లేనివి కూడా ఉనికిలోకి వస్తాయి. అయినా మనం వాటిని గుర్తించం.

సజూర్ భాషా విషయంగా చేసిన ఈ మౌలిక ప్రతిపాదనలతో ఏకీ భావం ప్రదర్శిస్తూనే డెరిడా తన డీ కన్‌స్ట్రక్షన్ సిద్ధాంతాన్ని రూపొందించుకునే క్రమంలో పునరన్వయం చేశాడు. భాష స్వీయ సంబంధాత్మకమని, అర్థం, భాషాంశాల మధ్య ఉండే తేడావల్ల ఉత్పన్నమవుతుందన్న సజూర్ దృక్పథంతో డెరిడాకు ఏకీభావం ఉంది అలాగే ప్రతి భాషా సంకేతంలోనూ అనుపస్థిత సంకేతాల గురుతులున్నాయనే సజూర్ అభిప్రాయంతో అంగీకరిస్తాడు డెరిడా

డెరిడా మాటల్లో చెపితే మాట్లాడే లేదా లిఖిత సంభాషణా క్రమంలో ఏ మూలకమూ దానికదిగా మాత్రమే ఉంటూ ఏ ఇతర మూలకాలనీ సూచించకుండా సంకేతంగా వ్యవహరించలేదు సజూర్‌తో విభేదం డెరిడాకు erasure అనే భావన దగ్గర ఉత్పన్నమవుతుంది. ప్రస్తుత సంకేతంలో

ప్రస్థిత సంకేతాల జాడల్ని డెరిడా erasure అన్నాడు చెప్పిన సంకేతం ఆ సంకేతంలోని traces ద్వారా తుడిచివేతకు గురవుతుంది

డెరిడా ప్రవేశపెట్టిన విమర్శ సిద్ధాంతానికి సంబంధించిన ముఖ్య గ్రంథం 'of Grammatology'. దీన్లో డెరిడా తన విచారణను భాషనుంచి లేఖనానికి తీసుకుపోయాడని యం.హెచ్ అబ్రామ్స్ పేర్కొన్నాడు. వాచకాన్ని అసాధారణమైన పరిమిత దృష్టిలో అర్థం చేసుకున్నాడని అంటాడు. మరో విమర్శకుడైన న్యూటన్ గార్వేర్, భాషా తత్త్వవేత్తగా డెరిడా తర్కంపై శబ్దానికి ఉన్న ఆధిక్యాన్ని నొక్కి చెప్పాడని పేర్కొన్నాడు

వీటి నిలా ఉంచితే ' ఆఫ్ గ్రామటాలజీ'లో 'లేఖనం', 'భాషణం' అనేవి కీలక పదాలు. లేఖనం పైన భాషణానికున్న ఆధిక్యాన్ని ప్రాచీన భాషాభావన సమర్థిస్తుంది. ఉచ్చరిత పదం బాహ్యప్రేరితం కాదు. తనలో తాను ఉచ్చారణతోనే రూపుమాపుకుంటుంది కాబట్టి సంకేతితంగా అది సంకేతితమూ సంకేతకమూ అవుతున్న క్రమంలో తనని తాను స్వయంగా నిర్మాలించుకుంటుంది. ప్రాచీన భాషా భావన ప్రకారం లిఖిత పదం గ్రాఫిక్ (లేఖ్యం లేదా రేఖీయం) మాట్లాడినపదానికిది ప్రాతినిధ్యం వహిస్తుంది. అంటే దీనర్థం లిఖితపదం మాట్లాడిన పదానికి సంకేతితం అవుతుంది క్లుప్తంగా చెపితే లిఖిత పదం స్వసంకేతితానికి సంకేతిత మవుతుంది దీన్తో పాటే యిది మాట్లాడే పదానికి గౌణ (Secondary) మవుతుంది. ఈ తరహా భాషాదృక్పథం పశ్చిమ తత్త్వజ్ఞానం మీద ఆధారపడి ఉందని భావించాడు

ఈ నేపథ్యంలోనే లేఖనం, భాషణం అనే పదాలను గూర్చి వ్యాఖ్యానిస్తూ భాషకు, లేఖనానికి సంబంధించిన భావన 'లోగోసెంట్రిక్' అని వాదించే ధోరణిని నిరసించాడు. సంకేతంలో సదా సంకేతితం, సంకేతాల మధ్య లేడా ఉంటుంది సజూర్ భాషను ఒక కాగితంతో పోల్చాడు. ఆలోచన అన్నది దాని ముందు భాగం అయితే ధ్వని వెనుక భాగం వెనుక భాగం తెగకుండా ముందు భాగాన్ని తెంపే వీలుండదు అలాగే భాషలో కూడా ఆలోచన నుంచి ధ్వనిని గాని, ధ్వనినుంచి ఆలోచను గానీ విడదీయలేము. భాషణం, లేఖనమనేవి తత్త్వజ్ఞాన భావనచేత గౌరవింపబడుతున్నాయి. ఈ లోగో సెంట్రిజం, ఫోనో సెంట్రిజం (ధ్వనికేంద్రక) కూడా అవుతుంది. డెరిడా సిద్ధాంతంలో ఈ రెండు పదాలు కూడా ఒకే దృగ్విషయాన్ని వహించే భిన్న పదాలు. లేఖనం కన్నా భాషణానికి అమిత ప్రాధాన్యాన్నిచ్చే సాంప్రదాయిక భావనను మార్చాడు డెరిడా. లోగోసెంట్రిజం నుంచి గ్రాఫోసెంట్రిజానికి వచ్చాడు. గ్రాఫోసెంట్రిజం అంటే భాషణం నుంచి లేఖనానికి ప్రాధాన్యాన్నిచ్చే దిశాక్రమంలో కదలటమే. భాషణం లేఖనమనే ప్రాచీన భావనలకు సజూర్ పెట్టిన పేరు సంకేతితం, సంకేతకం అని డెరిడా పేర్కొన్నాడు. భాషను రెండు ప్రక్కలు కలిగిన కాయితంగా సజూర్ ఎప్పుడైతే పోల్చాడో అప్పుడే సజూర్ లోగోసెంట్రిజం అన్న సంప్రదాయం దగ్గరే నిలిచి పోయాడని అది ఫోనో సెంట్రిజం కూడా అవుతందని పేర్కొన్నాడు ఈ కారణంగా భాషణానికి ప్రథమ స్థానాన్ని, లేఖనానికి ద్వితీయ ప్రాధాన్యాన్ని ఇచ్చిన అధి భౌతికం, భాషాశాస్త్రం, నిర్మాణవాదం ఈ మూడు అనుశాసనాలను డెరిడా వదిలి పెట్టాడు. లేఖనం పట్ల వీటికి ఉన్న భావనలను 'వల్గర్ కాన్సెప్ట్స్' అని నిందించాడు అధిభౌతిక సర్వాధికార ప్రభావం నుంచి భాషను, విమర్శను విముక్తం చేయాలని సంకల్పించిన డెరిడా లేఖనం అనే కొత్త భావనను ప్రతిపాదించాడు దీనికే ఆయన ప్రప్రథమ ప్రాధాన్యాన్ని ఇచ్చాడు.

లేఖనం అనే డెరిడా భావన మూడు సంక్లిష్టమైన పదాలపై ఆధారపడి ఉంది ఒకటి. తేడా, విభిన్నం (difference) రెండు చిహ్నం గుర్తు (Trace) దీనిని అనురేఖనంగా కూడా చెప్పవచ్చు. మూడు మూల లేఖనం (arche - writing) దీన్లో మొదటిదైన తేడాకు రెండు విధాలైన క్రియలుంటాయి వీటిని రెండు విధాలుగా సూచించాడు. ఒకటి differing రెండోది deferring డిఫరింగ్ అంటే ఒకటి మరొక దాన్లా ఉండకపోవడం, ఒకటి మరొకటి కాకపోవటం. విభిన్నంగా ఉండటం. ఇది సీమాబద్ధం (Spatial). రెండోది deferring విలంబం. వ్యవధానం జాగు లేదా వాయిదా వేయడం. ఒక విధంగా ఇది సామయికబద్ధం (Temporal). ఇది తాత్కాలికం. డెరిడా ప్రకారం ప్రతి సంకేతం ఈ రెండు కార్యాలను ప్రదర్శిస్తుంది కనుక సంకేత నిర్మాణం ఈ రెంటిచేత నియంత్రితమై ఉంటుందే తప్ప సంకేతిత, సంకేతకాలతోకాదు. ఇక్కడే సజూర్‌కి ఎడంగా జరిగి ఆలోచించాడు డెరిడా.

సంకేతం అంటే అది మరో సంకేతంలా ఉండకపోవడం, అదసలు సంకేతమే కాకపోవడమూ అవుతుంది ఇదే క్రమంలో ప్రతి సంకేతం మరో సంకేతంతో తేడాని కలిగి ఉంటుంది దీన్తోపాటుగా సంకేతానికి డిఫర్మెంట్ (deferment) అనే స్వభావం ఉంటుంది వాయిదా వేయడం, జాగు చేయడం, వ్యవధానం పాటించడం, విలంబం కలిగి ఉండగల సామర్థ్యమే 'డిఫర్మెంట్'. అట్లాంటప్పుడు సంకేతం అసలక్కడ లేనిదే అవుతుంది. ఉదాహరణకు ఏదో ఒకకవిత 'పద్మం' తో మొదలవతుందనుకుంటే - పద్మం అనే సంకేతం దాని అర్థాన్ని ఎప్పుడు ఎరుక పరుస్తుంది? మనం వాస్తవంలో చూసే పద్మం అది కాదని గుర్తించాకే. రోజా మనం చూచేది కాదని తెలుసుకున్నాకనే దాని అర్థాన్ని అది యిస్తుంది. అసలు అదేమిటో మనం గుర్తించడంలోనే అనివార్యంగా వ్యవధానం వస్తుంది కాబట్టి ప్రతి సంకేతంలోని సగభాగం అది కానిది. మిగతా సగం అసలక్కడ లేనిది అవుతుంది. సంకేతంలో దాని అభావం కూడా ఉం టుంది. దీనిని వివరిస్తూ ఎస్ రవీంద్రన్ అనే విమర్శకుడు ఈ విధంగా వ్యాఖ్యానించాడు: ప్రతి సంకేతం విభిన్నం, వ్యవధానం అనే శక్తులను కలిగి ఉంటుంది. సంకేతం దాని అర్థాన్నిచ్చే క్రమంలోనే అదృశ్యం కావాలి అలా అవుతుంది కూడా. అంటే దీనర్థం ప్రతి సంకేతం సగభాగం పర్యాప్తం (adequate) తతిమ్మా సగభాగం అపర్యాప్తం (inadequate). ఎందుకు యిలా సంకేతం పర్యాప్త, అపర్యాప్త, స్వభావాన్ని ప్రదర్శిస్తుందనే ప్రశ్న వస్తుందిక్కడ. ప్రతి సంకేతం అది వ్యక్తం చేయాలనుకున్న దాన్ని కచ్చితంగా వ్యక్తపరచలేదు అయినా అవసరార్థం దానినే వాడక తప్పదు. అది తప్ప మరో సంకేతమేదీ తగి ఉండని కారణంగానే ఆ సంకేతాన్ని వాడాల్సి వస్తుంది. అంటే పూర్తి పర్యాప్త (adequate) సంకేతమంటూ ఏదీ లేదు. ఈ కారణంగానే ప్రతి సంకేతం తుడిపివేత క్రింద రాయాల్సి వస్తుంది. దీనినే డెరిడా erasure అని పిలిచాడు. (సృజనాత్మక రచనలలో యిది ఎక్కువగా ఉంటుంది. ఏటుకూరి ప్రసాద్ కూర్చిన 'పోయెట్రీ వర్క్‌షాప్' పుస్తకంలోని కవుల తొలి సిద్ధ ప్రతులను పరిశీలిస్తే erasure ప్రాధాన్యాన్ని గుర్తించవచ్చు).

ఇక ప్రతి సంకేతాన్ని తుడిపివేతకు గురిచేస్తూ రాయడమంటే సంకేతమనేది అపర్యాప్తంగా ఉంటుందని భావించే వీలుంది. డెరిడా సంకేతానికున్న పరిమితుల్ని గుర్తించాడు కాబట్టే 'erasure' అనే పదాన్ని విమర్శ పరిభాషలోకి తీసుకొచ్చాడు. మనమేదైనా చెప్పదలచినప్పుడు అందుకు తగిన సంకేతం అందుబాటులో ఉండదు. ఉందనుకున్నా అది చెప్పదలచిన భావానికి సరిపోదు.

ఈ తరహా ఇబ్బంది ప్రతి సంకేతంతోనూ ఎదురవుతుంది మరీ ముఖ్యంగా సృజనాత్మక రచనా క్రమంలో యిది మరింత విస్పష్టంగా కనిపిస్తుంది.

ఈ చర్చను బట్టి మనం ఏం చెప్పవచ్చునంటే, సంకేతానికి స్థిరమైన అర్థమంటూ ఏదీ లేదు సంకేతానికి ఉండే అర్థం సందర్భానుగతమై ఉంటుంది. సంకేతం నిర్వర్తించగలిగిన కార్యం ఏదైనా ఉందంటే అది తత్సంకేతంలో ఏది లోపిస్తుందో దానిని వెతికేందుకు మనల్ని పురికొల్పుతుంది లోపించిన దాన్ని అన్వేషించేందుకు పూనుకునేట్లు చేస్తుంది సంకేతం ఏది కాలేక పోయిందో మనకు గుర్తుచేస్తుంది. కాబట్టి సంకేతం ఒకగుర్తు (Trace) లేదా జాడ మాత్రమే డెరిడా మాటల్లోనే చెపితే - సంకేతం సాంస్కృతికం కంటే అధికంగా స్వాభావికం కాదు మానసికం కంటే ఎక్కువగా భౌతికం కాదు ఆధ్యాత్మికం కన్నా అమితంగా జైవికం (biological) కాదు. అదొక వెతుకులాటకు నాంది ఒక గమనానికి ప్రారంభ సూచకం గమ్యమంటూ ఏదీ లేకుండా నడిచే ఒక దశాక్రమంగా మాత్రమే మిగుల్తుంటుంది కనుక అదెప్పుడూ trace గానే ఉంటుంది.

సాధారణంగానే మనం వర్ణాత్మకమై, అర్థాన్నిచ్చే ప్రతిదానిని లేఖనం అనే పిలుస్తుంటాం డెరిడా ప్రకారం difference, trace, arche - writing అనే భావనల కారణంగా లేఖనానికి విస్తృతార్థ ప్రతి పత్తి కలుగుతున్నది. అక్షర రూపంలోనే కాక దానికి భిన్నంగా రాయబడే ప్రతిదీ లేఖనం క్రిందకే వస్తుంది. అంటే రేఖాత్మకమైన దేదైనా లేఖనమే అవుతుంది. లేఖనాన్ని నిర్వచించేందుకు యత్నించిన డెరిడా ఈ విధంగా అభిప్రాయ పడ్డాడు. 'inscription in general whether it is literal or not and even if what it distributes in space is alien to the order of the voice' 'ఈ దృష్ట్యా చూచినప్పుడు సంగీతం, శిల్పరచన, సినిమాటోగ్రఫీ మొదలైనవి కూడా లేఖనం క్రిందకే వస్తాయంటాడు విజయ్ కుమార్ దాస్ అనే విమర్శకుడు

వ్యక్తీకరించబడే దాని వాక్కుతో ఏ సంబంధం లేని దాన్నైనా లేఖనంగానే స్వీకరించాలి. అదే విధంగా దేనినిగురించి చర్చించే భావ వ్యక్తీకరణ అయినా లేఖనమే కాగలదు. దీనిమీద వ్యాఖ్యానిస్తూ గాయత్రీ స్పివాక్ చక్రవర్తి ఇలా అభిప్రాయపడింది· "Something that carries within itself the trace of a perennial alterity, the structure of the psyche, the structure of the sign, to this structure Derrida gives the name writing" నిరంతరాయంగా మార్పుచెందే స్వభావాన్ని కలిగి ఉన్న భావచిహ్నానికి ఆకృతి, మనసు యొక్క నిర్మాణం, సంకేతాకృతి. ఈ నిర్మాణానికే డెరిడా పెట్టిన పేరు లేఖనం. ఆ మాటకొస్తే భాష అనేది లేఖనమే తప్ప మరొకటి కాదు. చిహ్నం ద్వారా అప్పటికే ఉనికిలో ఉండే నిర్మాణమే లేఖనం అన్నది డెరిడా అభిమతం. యిది లేఖనం పట్ల స్వానుభావాత్మక భావన కన్నా విశాలతరమైంది లేఖన మంటే సాంప్రదాయిక భావనకు భిన్నంగా ఆలోచించిన డెరిడా ఈ తరహా లేఖనాన్ని arche-writing గా వ్యవహరించాడు. దీనిని మౌలిక లేదా ప్రాథమిక లేఖనం అనొచ్చు. చిహ్నాలను వహించే నిర్మాణం ఏదైనా లేఖనమే అవుతుంది. ఇది లేఖీయ, అలేఖీయ అభివ్యక్తుల్ని కలిగి ఉంటుంది. కాబట్టే విమర్శకులు ఈ విధంగా వ్యాఖ్యానించారు: "writing is the name of any structure that carries trace. It can be anything - a portrait, a wall post, a proper name, a gesture, a spoken word, or a written word that sets the awarness into movement" లేఖనం అది ఏదైనా గమనంలోనే ఒక ఎరుకను ఏర్పరుస్తుంది.

శబ్దాలు నిర్దేశాత్మకాలు కావు స్వీయ నిర్దేశాత్మకాలు ఎందుకంటే అవి బాహ్యా వస్తువులను నిర్దేశించవు, ఒక దానిని మరొకటి సూచిస్తాయన్న దృక్పథం గల సజూర్‌ని పునరన్వయించాడు డెరిడా అన్నది మన అవగాహనలోకి ఇది వరకే వచ్చిన అంశం. భాషనే దాన్ని ఒకానొక స్వేచ్ఛా క్రీడ అనే భావనగా స్థిర పరిచాడు డెరిడా ఈ స్వేచ్ఛాక్రీడకు ఒక నిశ్చిత కేంద్రం అంటూ ఉండదు. అలాగే భాష సత్యాన్ని తెలియజెప్పే సామర్థ్యం లేనిది అంటాడు మిగిలిన వాటి లాగే సాహిత్యం కూడా ఒక లేఖన రూపమే కవిత, కథ, నవల ఇవన్నీ చిహ్నాల నిర్మాణం. ప్రతి చిహ్నం విభిన్నంగా ఉంటుంది. విమర్శకుడు కవితలోని శబ్దానికున్న అర్థాన్ని గానీ, లేదా కవిత మొత్తానికి ఉండే అర్థాన్ని గానీ కనుగొనే ప్రయత్నంలో ఒక పదానికి మారుగా మరొక పదాన్ని చేర్చుకుంటాడు. లేదా పదక్రీడలో జోక్యం కల్పించుకుంటాడు. ఇతః పూర్వం సాహిత్యరచనను విమర్శకు స్వీకరించే విమర్శకుడు ఒక భావనతో బయలు దేరేవాడు. ఈ భావన మరొక దానితో సంవదించి ఉండేది. ఆ భావన మరొక దానితో సంబంధాన్ని కలిగి ఉండేది. ఈ పద్ధతినే అనుసరిస్తూ మనం మరికాస్త వెనక్కి వెళ్ళగలిగితే ఈ భావనలన్నీ తత్త్వజ్ఞాన లేఖనాలే అని చెప్పవచ్చు. కాబట్టి రచనా కళ అనేది ఒక గ్రంథం. ఒక పవిత్ర వస్తువు. ఎంచేతనంటే దాని అర్థం దాని పుట్టుక, సత్యం, అంతిమ వాస్తవం అనే భావనతో సంవదితమై ఉండేది. విఘటన వాద విమర్శ సిద్ధాంతంలో మనకు పవిత్రగ్రంథాలు లేవు. వాటి స్థానంలో వాచకాలు ఉన్నాయి. సాహిత్య విమర్శ అంటే స్వీకరించిన వాచకంలోని పదాలతో విమర్శకుడు నిరంతరం పాల్గొనే కార్యకలాపాల మొత్తం. ఈ దృష్ట్యానే సాహిత్య విమర్శకు, సాహిత్య సృజనకు మధ్య భేదం చెరిగిపోయింది. ఎందు చేతనంటే ఈ రెండూ పదాలతో జరిపే క్రీడ కనుక.

డెరిడా అభిమతాను సారంగా కవి లేదా రచయిత తన అర్థాన్ని ఒక పదానికి వేరొక పదానికి మధ్య నిర్దిష్టంగా, కచ్చితంగా వ్యక్తం చేయలేడు. లేఖనం ద్వారా కవి సూచించగలిగిన దాని కంటే, సూచించిన దాని కన్నా సూచించాల్సిందే అధికంగా ఉందని భావిస్తాడు. కాబట్టి విమర్శకుడు వాచకంలో కవి వాడిన శబ్దాలను, పదాలను తాను ఉద్దేశించిన అర్థానికి బాహ్య రూపంగా వాడాడని భావించ కూడదు వాటిని కేవలం తాను అనుకొన్న అర్థానికి చిహ్నాలుగా, సూచిక (indicator)గా భావించాడనే తెలివిడిని ప్రదర్శించక తప్పదు. కవి వాడే ప్రతి పదం తుడిచివేత క్రిందనే స్వీకరించాడు కనుక విమర్శకుడు చిహ్నం (Trace) ఇది కూడా కవి అందించిన ఆధారమే. ఈ చిహ్నంతో ఆ కవి రచయిత ఇవ్వదలచిన వాస్తవార్థ ఛాయలకు అన్వేషిస్తూ పోగల గాలి విమర్శకుడు. సాహిత్య రచనను తనకు అందినంత మేరకు, తాను అవగాహన చేసుకున్నంత వరకు పునః సృజించాల్సిందే. అంతే తప్ప వాచకం చెప్పే నిజమైన అర్థాన్ని నేను చేరుకున్నానని ఏ విమర్శకుడు ప్రకటించే అవకాశం లేదు అంతమంటూ లేని ఒక నిరంతర అన్వేషణను విమర్శకుడు జరుపుతూ ఉండాల్సిందే ఈ విధంగా సాహిత్య విమర్శ, సృజనాత్మక రచనను వదలకుండా వెంబడిస్తూ పోవలసి ఉంటుంది. అదొక అనంత కార్యం. సాహిత్యమంటే విఘటన వాదుల దృష్టిలో ఒక నిశ్చయ కేంద్రమంటూ లేని సంకేతితాల స్వేచ్ఛా క్రీడ. దీన్నే విశ్వసించారు. పదాలు మోసుకొచ్చే అర్థాన్ని చూపడానికి దూరంగా, అర్థం అనుపస్థితం (absence) అని, అర్థాన్ని నిర్ధారించ వీలు లేదని వాదిస్తుంది ఈ వాదం. అభినవ విమర్శకులు అర్థం ఉనికిని స్థిరపరిస్తే వీరు సాహిత్యంలో

demystification గురించి మాట్లాడారు. వీరి దృష్టిలో సాహిత్యం మార్మిక విషయం కాదు, విమర్శకుడు అర్థాన్ని స్పష్టంగా ఆవిష్కరించి చూపడానికి.

విఘటన వాద విమర్శ సాహిత్య విమర్శను రెండు విధాలుగా విభజించి నిర్వచించింది. మొదటిది అధిభౌతిక (Metaphysical) రెండోది విఘటిక (deconstruction) విమర్శ. అధిభౌతిక లేదా పారలౌకిక విమర్శ వాచకానికి ఒక నిశ్చిత అర్థం వుంటుందని ఆ అర్థాన్ని విమర్శకుడు విశదం చేయాలని భావిస్తుంది రెండోది దీనికి పూర్తి విరుద్ధం. అర్థమనేది అనిశ్చితమని, నిర్ధారించ వీలు లేనిదని భావిస్తుంది. దీని దృష్ట్యా రచయిత ఒక్కోసారి అర్థాన్ని రూఢం చేస్తాడు. ఒక్కోసారి రూఢి పరచడు. తన అర్థాన్ని రచయిత చెపుతాడు చెప్పడు అంటుంది. హెగెల్‌పరి భాషలో చెపితే అభినవ విమర్శలో థీసిస్, యాంటీ థీసిస్‌లు సింథసిస్‌గా పర్యవసిస్తాయి. విఘటన వాద విమర్శ అసలు సింథసిస్ సాధ్యమే కాదంటుంది నిర్మాణరహిత వాద విమర్శ మౌలిక లక్షణంపై వ్యాఖ్యానిస్తూ Hilles Miller ఈ విధంగా అంటాడు: "The deconstruction rather annihilates the ground on which the building stands by showing that the text has already annihilated that ground knowingly or unknowingly Deconstruction is not a dismantling of the structure of a text but a demonstration that it has already dismantled itself'. అంటే వాచక నిర్మాణాన్ని కూల్చటమో, శిథిల పరచటమో కాక తానుగా కూలిపోయి ఉన్న వాచకాన్ని ప్రదర్శించటమే విమర్శకుడు చేయాల్సిన పనిగా విఘటన వాదం భావిస్తుంది. అంటే వాచకాన్ని విఘటన మైందిగా చేయటం దీని వ్యాపారం కాదు. తనంతట తానుగా శిథిలంగా ఉన్న వాచక నిర్మాణాన్ని యిది విఘటిస్తుందని అర్థం చేసుకోవచ్చు. ఇక్కడే ఒక ముఖ్యమైన సమస్యను ఎత్తి చూపారు విమర్శకులు. వాచకాన్ని విమర్శకుడు విఘటించడానికి అప్పటికే శిథిలమై ఉన్న వాచకానికి మధ్య విభాజక రేఖని ఏవిధంగా చూపగలుగుతాం అన్నది ప్రశ్నార్థకమైంది. ప్రతి వాచకం దానంతట అదే విఘటన మీద ఆధారపడి ఉంటుంది కనుక విమర్శకుడు పూర్వ నిశ్చితాల వల్ల వాచకం మీద కన్నా విఘటనం మీదనే దృష్టి నిలుపుతాడు. అంటే దీనర్థం డీకన్‌స్ట్రక్షన్ అంటే 'a dismantling of the structure of text' అన్న దగ్గరకే వచ్చి చేరుతుంది. శిథిలంగా ఉన్న నిర్మాణాన్ని తిరిగి శిథిల పరచడమే అవుతుంది. ఈ క్రమంలో వాచకం మరో ఘటనాన్ని పొందుతుంది. వాచకాన్ని ఒక క్రమ విధానంలో అనుసరించ దగిన పద్ధతిగా ఈ విమర్శను పేర్కొనే వీలులేదు. వాచకత్వ విభజనను ఆవిష్కరించే అప్రమత్త ఆచరణగానే దీనిని చెప్పాల్సి ఉంటుంది.

డెరిడా ప్రతిపాదితమైన ఈ సిద్ధాంతంపై సాహిత్య విమర్శలో అనుకూల ప్రతికూల ప్రతిస్పందనలు విస్తృతంగా వచ్చాయి. మార్క్సిస్టులు చారిత్రక, సామాజిక విమితులని పట్టించుకోక పోవటమే దీన్లో ప్రధాన లోపంగా గుర్తించారు.

లోపాల మాట ఎట్లా ఉన్నప్పటికీ ఈ వాదం పూర్వ విమర్శనా విధానాలన్నిటినీ నిరాకరించింది. కానీ, ఏ ఒక్క విధానాన్ని, స్పష్టమైన పద్ధతిని యిది అందించలేక పోయింది.

అయినప్పటికీ ఈ వాదం విమర్శకుడిని కేవలం వ్యాఖ్యాతగానో, వివరణ కర్తగానో, అర్థాలను నిర్ధారించి చూపే వాడిగానో కాకుండా వాచకానికి సహ సృష్టికర్తగా భావిస్తుంది. వాచకం అంటే కవి రచయిత చేసింది మాత్రమే కాదు. వాచక నిర్మాణంలో విమర్శకుడికి కూడా ముఖ్యపాత్ర ఉందంటుంది దీనిని ఇంకాస్త పొడిగిస్తే విమర్శకుడు కవిని, రచయితను అధిగమించి ముందుకు పోయే వీలు కల్పిస్తుంది. విమర్శకుడు సృష్టికర్తను అధిగమించి పోవటమే ఈ విమర్శ విధానాన్ని అత్యంత వివాదాస్పదం చేస్తున్న కీలకం.

ఈ విమర్శ పద్ధతికి ప్రవర్తకుడుగా డెరిడా సంకల్పించింది సంప్రదాయ భావనల నుంచి ముందుగా భాషను విముక్తపరచటం, వాచకం అంటే సరికొత్త భావనను అందించి వాచకంతో విమర్శకుడు వ్యవహరించేందుకు నూతన విధానాలను రూపొందించటం. ఈ క్రమంలో వాచక అన్వయ బాహుళ్యానికి డెరిడా 'డిసెమినేషన్'ను ప్రత్యామ్నాయంగా ప్రతిపాదించాడు నిష్ఫలమైన వాచక అన్వయానికి విరుద్ధంగా ఈ 'డిసెమినేషన్'ను ఒక ఫలవంతమైన క్రమంగా భావించాడు. ఇది సంకేతాలను అధికం చేస్తుంది. ఇవి బీజాల్లాంటివి అనంతంగా ముందుకు సాగుతాయి ఏ సంకేతితం భావనాత్మకంగా గానీ, ఉద్దేశంలోగాని, అనుభవంలో గాని వాచకం అంటే ఏమిటో చెప్పదు. ఫలితంగా అనేక సత్యాల్ని కలిగి ఉన్న వాచకాన్ని అన్వయించటం వల్ల ఒక అర్థం దగ్గరే స్థిరంగా నిలబడిపోయే స్థితి వస్తుంది. దీనిని సంపూర్ణంగా నిరాకరించాడు. అర్థాన్ని నిర్ధారించకుండా స్థిర పరచకుండా విమర్శ సాగిస్తూ పోవటమే ఉత్తమమని భావించాడు.

వాచకానికి అనిశ్చిత అర్థాలుండటాన్ని అనుమతిస్తుంది. వాచకార్థాన్ని నిర్ధారించి చెప్పడం సాధ్యం కాదని అంటుంది. అలాగే అనేకార్థాలు, అంతర్వాచకత్వం అర్థ, అన్వయాల పట్ల సందేహాలు నిర్మాణ రహిత వాద విమర్శలో కనిపించే అంశాలు. వాచకాన్ని ఒక అడుగంటూ లేని బిలంగా మారుస్తుంది. దీనిని కొలవటం ఇంచుమించుగా అసాధ్యం. డెరిడా De- construction and criticism అనే గ్రంథంలోని ఓ వ్యాసంలో చెప్పిన రెండు విధాలయిన అభిప్రాయాలను యిక్కడ ఉటంకించటం ద్వారా విఘటనవాద విమర్శను యింకొంత స్పష్టంగా అర్థం చేసుకోవచ్చు.

" .. no meaning can be fixed or decided upon-no boarder is guranteed inside or out try it" అనేది ఒకటి. ఇక రెండోది "No meaning can be determined out of context but no context permits saturation"

యిదిట్లా ఉంటే Hillis Miller ఈ పద్ధతి విమర్శ మీద ఒక హెచ్చరిక లాంటిది చేశాడు. "A deconstructionist is not aparasite but a parricide" అన్నాడు. పితృ, మాతృ హంతకత్వం విమర్శకుడిలో పెచ్చరిల్లితే వాచకం ( మాతృక) హత్యకు గురవుతుంది. యిది సాహిత్య విమర్శకు ఏవిధంగా ఉపయోగపడగలదో విమర్శకులు ఆలోచించవలసి ఉంది. ఈ ఉపద్రవాల మాట ఎట్లా ఉన్నా తెలుగు సాహిత్య విమర్శకు deconstructive method of criticism అత్యవసరం.

# 'జాషువా'తో మధురవాణి

- పురాణం సుబ్రహ్మణ్య శర్మ

ఎవరో జాషువా గారి శ్మశానం ఖండ కావ్యంలోని పద్యాలు బిగ్గరగా ఆలపిస్తూ వుంటారు.

మధురవాణి : బలిజేపల్లి లక్ష్మీకాంత కవిగారి హరిశ్చంద్ర శ్మశానంలోని పద్యాలు మాని హరిదాసులు జాషువాగారి పద్యాలు చదువుతున్నారు, కాలం మారింది

గిరీశం ధామస్‌గ్రే ఎలిజీలో బరియల్ గ్రౌండ్ మీద గ్రేవ్స్, పద్యాలురాశాడు. వాటి ఇనిస్పిరేషనే జాషువాగారి పద్యాలకి అనుకుంటారు.

మధురవాణి జాషువాగారికి యింగ్లీషేరాదే అంతగా-

గిరీశం గ్రేట్ పొయెట్స్ థింక్ ఎలైక్ అనగా గొప్ప కవ్స్ ఒక రీతిగానే ఆలోచిస్తారు. ఆలోన చన్లు డాష్ యిస్తాయి. ఏక్సిడెంటుగా కావ్యాలు, అనగా క్లాసిక్కు పుడతాయి.

మధురవాణి జాషువాగారు క్లాసికల్ పొయెటా?

గిరీశం క్లాసిక్కు రాయక పోయినా క్లాసికల్ పొయెట్ కావచ్చు, ఆలోచన ముఖ్యం, బై ది బై షేక్స్‌పియరు గొప్పవాడా, జాషువా గొప్పవాడా అన్న ఆలోచనలో పడ్డా

మధురవాణి యేడే వాడేడే? అంటూ పూటకూళ్ళమ్మ యిటు చేతిలో చీపురు కట్టతో

గిరీశం ఈ మంచం కింద దాక్కుంటాను. జాషువా శ్మశానం పద్యాలు హాయిగా వినకుండా చేసింది దండుముండ.

(బయట నుంచి ' ఎన్నోయేండ్లు గతించి పోయినవి గానీ, యీ శ్మశాన స్థలిన్, గన్నులు మోడ్చిన మంద భాగ్యుడొకడైనన్ లేచి రాడక్కటా' వినిపిస్తుంది.)

మధురవాణి దండు ముండ అంటే ఏవిటండీ? జాషువాగార్ని మనం పిలిస్తే యిక్కడకు వస్తారా?

గిరీశం (మంచం క్రింద నుంచి) నీ యింటికి శ్రీశ్రీ, విశ్వనాథ, వీరేశలింగం గార్లు రాగాలేంది జాషువాగారు సందేహిస్తారా? 'ట్రయి అండ్ ట్రయి యొగైన్' అన్నాడు కాళిదాసు. దండు ముండ ఎవరనా అడిగావు, ముందు దాని చేతులోంచి చీపురు కట్టలాక్కో! మిలట్రీ ఎక్కడైనా దండుగా విడిది చేసే చోటుకి సప్లయి చేసే భామ.

(గిరీశం వెళ్ళి జాషువాగార్ని తీసుకవస్తాడు)

ఇది పిశాచులతో నిటాలేక్షణుండు
గజ్జె కదలించి యాడు రంగ స్థలంబు
ఇది మరణ దూత తీక్ష్ణమౌ దృష్టులొలయ
నవని బాలించు భస్మ సింహాసనంబు
(వినిపిస్తుంది)

మధురవాణి అసలు ఖండ కావ్యాలకు కీర్తి తెచ్చిన జాషువా గారికి స్వాగతం! సుస్వాగతం! మీరిక్కడకు రావడానికి సందేహిస్తారేమోనని భయపడ్డా.

గిరీశం : మధురవాణి మీకు సన్మానం చేస్తుంది, మీరు రావాలని నేను గురువు గారికి 'కీ'యిచ్చి కొట్టుకొచ్చా.

మధురవాణి : భాషరాదు; వట్టి పాలు మాత్రమెత్రాగు
నిద్రవోవు లేచినిలువ లేడు
ఎవరెరుంగ, రితనిదే దేశమో కాని
మొన్న మొన్ననిలకు మొలిచినాడు
శ్మశానం పద్యాలకి యిది వ్యతిరేకమైనది. అయినా తరవాత మీ శిశువు పద్యాలు, మందార మకరందాలు. ఖండ కావ్యాల కల్చరుకి మీరు గాడ్‌ఫాదరంటారు గిరీశంగారు. వెంకటేశం గారేమో జంధ్యాల పాపయ్య శాస్త్రి, కరుణశ్రీ గారి ఫేన్.

జాషువా · భాస్కరుని దానధార లే పట్టణంబు
చారు చరితకు బంగారు నీరు బోసె
అట్టి వినుకొండ కడుపున బుట్టు కతన
ధన్యుడను నేన! యుత్తమోత్తముడ నేన!
నాకు గురువులు యిద్దరు - పేదరికం, కుల మత భేదం. ఒకటి నాకు సహనాన్ని నేర్పితే రెండవది నాలో ఎదిరించే శక్తిని పెంచింది వడగాడ్పు నాజీవితమైతే వెన్నెల నాకవిత్వం.

మధురవాణి నమోన్నమః కృష్ణ శాస్త్రి బాధ ప్రపంచానికి బాధ. జాషువాగారి బాధ దళిత జీవుల కన్నీటి గాథ. వైతాళికులు పుస్తకంలో మీ కవిత లేదేం?

జాషువా : క్రైస్తవుండ, కవిని, కడు పేదవాడ, నా
లంబనంబు నాదరంబు లేని
ఆది మాంధ్ర కులుడ నని నమస్కృతి చేసి
విన్నవించుకొంటి స్వీయ చరిత్ర
ఎందుకో కృష్ణశాస్త్రికి నేనంటే గురిలేదు.
ఒకరు ప్రోత్సహించ నొక్కడు నిరసించ
నొకరు చేర బిలువ నొకరు తరుమ
మిట్ట పల్లములను మెట్టుచు ఎట్టులో
పలుకులమ్మ సేవ సలిపినాడ!
భావ కవిత్వం నేను చెప్పలేదు. పైగా కులవ్యవస్థ కల్పించిన మాయాజాలంతో పోరాడ్డమే సరి.
నా కవితా వధూటి వదనంబు నెగాదిగ జూచి, రూపు రే
ఖాకమనీయ వైఖరుల గాంచి, భళీ భళీ, యన్నవాడె మీ
దే కులమన్న ప్రశ్న వెలయించి, చివాలున లేచి పోవుచో
బాకున గ్రుమ్మినట్లగును! ..

మధురవాణి : గిరీశం గారు 'వేర్‌ది షూపించెస్' అనేవారు చెప్పు కరిచిన వాడికే బాధ. మీ బాధలోంచి విశ్వ జనీనమైన కవిత్వం పలికింది. హిందూ క్రైస్తవ మతాల రెంటి మధ్యా నలిగిన మానవుడు మీరు, కవితా పరిశ్రమ కోసం మసీదు నాశ్రయించారు అవునా?

జాషువా : అమృతము చిల్కి చింతల నపనయించు
హృదయము గలట్టి నవ రచయితను నేను

మధుర వాణి : శ్రీ శ్రీ ఉత్తమ కవుల శ్రేణిలో మీది రెండవ స్థానం అన్నాడట.

జాషువా : కవి అంటే వాల్మీకి, మిగతావారంతా రెండవ శ్రేణి వారే వాల్మీకి కోకిల తర్వాత.

మధురవాణి : అష్టా అదికాదు. మీరు సంప్రదాయ కవిత్వ ధోరణిని ఆశ్రయించి వ్యవహరించారు. బాల గంగాధర తిలక్ కవిత్వం అంటే శ్రీశ్రీకి తెలుసు, కృష్ణ శాస్త్రికి తె లుసు అన్నాడు ఆ దృష్టిలో.

జాషువా : నాకూ తెలుసు. విశ్వనాథ వారికి తెలుసు.

మధురవాణి : మీరు ఆధునికుల కవితలు సంప్రదాయ ధోరణులలో ఆ పద్యాల కట్టులో లేకపోవడాన్ని నిరసించారు. చెట్టు ఇస్మాయిల్ కవితని మీరు ఒప్పుకోరు - అవునా?

జాషువా : పద్యం సొగసు పద్యానిది. పద్యంలో చెప్పడంలో ఒక పట్టు వుంది. పూర్వ కవుల పద్యాలు వేలూ వందలూ కంఠతా అప్ప చెప్పవచ్చు. వచన పద్యాలనే దుడ్డుకర్రతో పద్యాల నడుముల్ విరగ దంతానన్నాడు కాని పద్యం చిరంజీవి. ఇప్పుడు ఎవరి కవిత్వం అప్పజెప్పి కోట్ చేసేవాడు లేడు.

మధురవాణి : దాశరథీ శతకం వచ్చినట్లు కంఠతా అమృతం కురిసిన రాత్రి వస్తుందా? కంఠతారావడం రాకపోవడం మంచి కవిత్వానికి గీటురాయి. కుందుర్తి నగరంలో వాన ఎంత గొప్పగా వుంటుంది!

జాషువా . నా మార్గం నాది. అనితర సాధ్యం కానిది మాత్రమే కాదు ఏకోరసః కరుణ ఏవ అన్నట్లు నేను ఆశ్రయించి దాన్ని పండించుగున్నాను.
ధట్టీ కట్టి నియోగి వైదిక కవుల్
దార్సిల్లి రన్యోన్యమున్
జుట్టుం బట్లు కళారణైక వి
జిగీషుల్, స్వీయ పాండిత్యముల్
గుట్టల్ గుట్టలు దిమ్మరించి రలు
కన్ కొన్నేడు లా దెబ్బతో
తిట్టుం కైతలు మారుమోగె,
సకలాంధ్రిన్ కోటి కంఠాలతో.

మధురవాణి · అదో చీకటి నీడ, శతావధాన యుగంలో యీ దుర్లక్షణం విపరీతంగా పేట్రేగింది.

జాషువా : గవ్వకు సాటిరాని పలు గాకులమూక లసూయచే న
న్నెవ్విధి దూరినన్ నను వరించిన శారద లేచిపోవునే
ఇవ్వసుధాస్థలిన్ పొడమరే రసలుబ్ధులు ఘంట మూనెదన్
రవ్వలు రాల్చెదన్ గర గరల్ సవరించెద నాంధ్రవాణికిన్

మధురవాణి : దురహంకారుల నుంచి మీకు గాయాలు తగిలినా మిమ్మల్ని ఆదుకున్న సత్పురుషులు కూడా వున్నారుకదా! ఏకా దండయ్య పంతులు శ్రీ పాదకృష్ణమూర్తి శాస్త్రిగారు మచ్చుకి

జాషువా : నేను మానసికంగా చాలా గట్టివాడ్ని.
సృష్టి కర్తవు నీవు నీ సృష్టిలోని

మానవుండ నే డిద్దరి మధ్య మనకు
ముసుగులో గ్రుద్దు లాటలు పొసగ వింక
హక్కుగలదయ్యా! ప్రశ్నవేయంగ నిన్ను

మధురవాణి . మీ రచనలో అన్నిటి కంటె మీకు ఎక్కువ యిష్టమైనది ఏది? నాకు పిరదౌసి, ఖండకావ్యాలు, తర్వాతే అన్నీ.

జాషువా : గబ్బిలం నీకు నచ్చలేదా? కావ్య శిల్పంకంటె అభిప్రాయ ప్రకటనే ముఖ్యం నాకు. వాస్తవికత నా పద్ధతి.

మధురవాణి · ''ప్రణయ కవి యొకండు, పాషాణ కవియొకండు'' అన్నారు కృష్ణశాస్త్రిని విశ్వనాథను. మీరేమంటారు.

జాషువా : మా కందరికీ మధ్య తగవులు పెట్టకు. ఎవరి మార్గం వారిది. ఎవరంత వారు వారు!

మధురవాణి : మీరు హిందూ క్రైస్తవాల మధ్య పాపం నలిగారా?

జాషువా : ఆశయాలు గొప్పవే కాని చెప్పే దొకటి చేసేదొకటి. యిది నా సొంత మతస్థుల ధోరణి.

మధురవాణి : అన్నట్లు మీరు ఆస్తికులా? నాస్తికులా? క్రీస్తు చరిత్రరాసి అకాడెమీ ప్రయిజు, పద్మ విభూషణ్ కొట్టేశారు.

జాషువా : నన్ను క్రైస్తవం నుంచి వెలి వేశారు. మిషనరీ స్కూల్లో ఉపాధ్యాయుడిగా చేసేవాడ్ని కదా! ఆ ఉద్యోగంలోంచి డిస్మిస్ చేశారు. కొప్పరపు సుబ్బారావుగారు మా వినుకొండ వచ్చినప్పుడు వారి మీద ఓ పద్యం రాశా. ఆయన సంతోషించాడు కాని కొందరికి నచ్చలే. ఆ సభనుంచి వాకౌట్ చేశారు. ఓ సారి నాకు రైల్లో యిలాగే జరిగింది. ఓ పాసెంజరు నా పద్యాలు విని భేషని మెచ్చుకుని మీదే కులం అని అడిగి నేను ఫలానా అని చెప్పగానే వాణి అంటు పడిందని తేలు కుట్టిన వాడిలా కంగారు పడ్డాడు.

మధురవాణి మనుషు లంతా సమానం అని పైకి లోపల ఎవరి కులం వారిదే. కాని మీరో -

జాషువా కుల మతాలు గీసుకొన్న గీతల జొచ్చి
పంజరాన కట్టువడను నేను
నిఖిల లోకమెట్లు నిర్ణయించిన నాకు
తరుగులేదు విశ్వనరుడ నేను.

మధురవాణి మీరు గాంధీ వాది. మీది మృదు స్వభావం, సమన్వయ శీలం.

జాషువా చిన్నప్పుడు స్కూల్లో బెంచీలు దూరంగా వేయించి మమ్మల్ని కూచో పెట్టేవారు. 1906 ప్రాంతంలో అంటరాని వాడని చిన్నప్పుడు నన్ను ఆటల్లోకి రానివ్వకపోతే ఒక కుర్రాడ్ని చెంప దెబ్బ కొట్టి ''యీషాక్ నీకు కాదు బ్రదర్''! నీకుల భేదానికి అని వడ్డించా. నాకు సంస్కృతం చదువుకోవాలని వుండేది మహానుభావుడు జూపూడి యజ్ఞన్న శాస్త్రిగారు నాకు కాళి దాసత్రయాన్ని చెప్పారు.

మధురవాణి ఆయన చెప్పబట్టి మీరు మేఘసందేశం చదివారు గబ్బిలం రాశారు. మీకు మోడర్న్ అవుట్‌లుక్ వున్నది గాని అది ట్రెడిషనల్ ఫారంలో బయట పడింది అక్కడే పేచీ.

నిమ్న జాతుల వారి కన్నీటి నీరదాలు పిడుగులై దేశాన్ని కాల్చివేస్తాయని అన్నా

అది నిజం కుల తత్వం కరడు కట్టిన కొద్దీ నాపద్యాలు దీపాలై వెలుగుతాయి
పంచములలోన మాదిగ వాడ నేను
పంచమీయులలో మాలవా డతండు
ఉభయులము క్రైస్తవ మతాన నొదిగినాము

మధురవాణి : అన్నట్లు వారిరువురికీ పడదు కదూ, ఒక జాతికి ఒక మతానికి చెందిన కవిత్వాలు వీలునామా కవిత్వాలు. అన్నిమెట్ల బరువునీ ఆఖరి మెట్టే మోస్తున్నా వాటిలో మళ్ళీ. మా,మా చీలికలు. అందుకే అన్నారు మీరు - 'కసరి బుస కొట్టు నాతని గాలి సోక నాల్గు పడగల హైందవ నాగరాజు' అని

జాషువా నాలుక్కాదు వేయి పడగలు ఈ బలహీనతను కనిపెట్టే క్రైస్తవ మిషనరీలు 'మామా' లను చేరదీసి తమ మతంలో కలుపుకున్నారు.

మధురవాణి . ఒకానొక మాధుర్యం మీ కవితల్లో సరస్వతీదేవి అనుగ్రహంచేత పడిపోయిందని విశ్వనాథ వారన్నారు. మీరు స్త్రీ వాద కవిత్వం రాయలేదా?

జాషువా : అవన్నీ నా వెనకాల వచ్చాయి. నా కత్తి కవిత. దానికి సంఘంపై ద్వేషం లేదు. దాని విధానంపై ద్వేషం.
'నలుబది యేండ్లు' దాటినవి నాకిపుడున్ నను ముద్దులాడు ము
ద్దుల జ ననీ! భవన్మధుర దుగ్ధము రక్తము రంగరించి, యు
గ్గులనిడినావు; నీ హృదయ గోళము లోపల నేను దమ్మెడున్
మెలగని తావులేదు; గణనీయము నీ జననీత్వ మర్వరన్
అని మా అమ్మ గురించి చెప్పుకున్నా. ఇంకా
-అరువది యేండ్లు నాదగు శిరోగ్రము నెక్కిన దల్లి కంటికిన్
జిరుతను గాక పోనిది, విచిత్రము,
నేనిలు దాటిపోయినన్ మరలినదాక నా వెనుక మా యను జీవము మూడు
గాళ్ళతో దిరుగుచునుండు, నీ ఋణము దీరదు రక్తము ధార వోసినన్

మధురవాణి మీకు, సంజీవ దేవ్ గారికి ఎలా కలిసింది?

జాషువా ఆ రోజుల్లో గుంటూరులో సర్జరీ శిల్పి డా. సదాశివరావు నెల కోసారి సాహితీ సదస్సు జరిపేవారు, దానిలో నేనూ సంజీవ దేవ్ గారు పాల్గొనేవాళ్ళం. శ్రోతలుగాను వక్తలుగాను ఆ తరువాత ఏమైనా తింటూ మాట్లాడుకునేవాళ్ళం.

మధురవాణి సంజీవదేవ్ గారికి చిత్రకళ అంటే ప్రీతి. దేవికారాణి రోరిక్‌లతో ప్రత్యక్ష పరిచయం వుండేదట.

జాషువా ఆయనకు మీసాల్లేవు. నాకు మీసాలుండేవి. అంతంత పెద్ద మీసా లెందుకు మీకని వాదించేవారు నాతో.

మధురవాణి సాహిత్యంలో మీసాలతో పేచీ చాలామందికి వచ్చింది తిరుపతి వేకంట కవులు మీసాల పద్యం ఒక ఉదాహరణ, రాయల వారి మీసం చిన్నమ్మా దేవిని యిబ్బంది పెడితే ముక్కు తిమ్మన పారిజాతాపహరణం చెప్పి వారి తగవు తీర్చాడట. ''రొయ్యకు లేదా బారెడు మీసం'' అన్న ప్రయోగం వుండనేవుంది గురజాడ అప్పారావు గారికి మీసాలే కదా అందాన్నిచ్చింది.

జాషువా ఆయన బహు భాషాకోవిదుడు తెలుగులో సుందరత, ప్రధానత, సుకుమారత అని 'త' తగిలించి రాసేవాడు. అది తెలుగు నుడికారం కాదని వాదించేవాడిని.

ఆయనకు నా కావ్యాల్లో పిరదౌసి అంటే ఇష్టం. ఇతి వృత్తం అనడం రాక 'వస్తువు ' అని వాడేవాడు.

మధురవాణి : కవిత్వాతీత పరిచయాలు కూడా వుంటాయి కదా!

జాషువా : నేను రిటైరయాక ఆయన గుంటూరువచ్చినపుడల్లా కలుసుకునేవాళ్ళం.

మధురవాణి : దళితుల తర్వాత అణగతొక్కబడుతున్నది మన సమాజంలో స్త్రీలే కదా?

జాషువా : సర్వేజనాః సుఖినోభవంతు అని అంటాం గాని ఎవర్నీ సుఖంగా వుండనివ్వం (నవ్వు)

అబలయన్న బిరుద మంటించి కాంతల
స్వీయ శక్తు లదిమి చిదిమి నారు
సబలయన్న బిరుదు సాధించి హక్కులు
గడన చేసి కొమ్ము కష్టచరిత!

మధురవాణి : మీ వంటి కవి ఒక కులానికి వర్గానికి మతానికి మాత్రమే పరిమితం కాదు. మీరు ప్రపంచానికి చెందుతారు. కేవలం గుంటూరు సీమకే కాదు

జాషువా : భార్యని గౌరవించ లేని వాడు మనిషికాడు

నా తను యష్టి ప్రత్యణువునన్ గలపుష్టికి కారణంబు నీ
చేతి సుధాశనంబెకద? చిక్కనె నాకనరాదు గాని, నా
మాతకు మారుగా, యనుగుమానిని రూపము దాల్చినట్టి నా
జాతక పుణ్య రేవో, ప్రశస్త శుభైక వరప్రదాత్రివో!

మధురవాణి : భార్య కొంత కాలానికి తల్లిగా మారుతుందని ఎంత మందికి తెలుసు? మీ అమ్మాయి హేమలతను గోరాగారి లవణానికి యిచ్చి వివాహం చేసినప్పుడు 'మిగిలెన్ రసహీన కవిత్వ వాణియున్, తూలెను దేహ దార్ఢ్యము' అని వాపోయారు - ''కన్న తల్లి ఏదిశన్ నిలచి హారతులిచ్చుచున్నదో'' అన్నారు గుర్తుందా? అన్నట్లు మీరు వీరేశలింగం గారిని కలిశారట నిజమా?

జాషువా : 1916 - 20 ల మధ్య సంఘ సంస్కరణ పతాకాన్ని ఎత్తారు పంతులుగారు. రాజమండ్రిలో మానవునిగా నాకు ఆదరణ లభిస్తుందని మూవీ - మూకీ సినిమాలో కథకునిగా అల్ప వేతనంతో రాజమండ్రి చేరుకున్నా, పంతులు గార్ని కలిశా. ఆయన ఆప్యాయంగా ఆశ్రయ మందించారు అప్పటికే ఆయన రాజ్యలక్ష్మి గారి వియోగంతో అనారోగ్య క్లేశంతో అలసివున్నారు. ఆయన చిలకమర్తి వారికి పరిచయం చేశారు. చాలా సన్నిహితంగా చిలకమర్తి వారు చేరదీసి ఆశీర్వదించారు

అందరము పుట్టు పాపులమని అహేతు
కముగ భయ బీజములు నాటి కలతపెట్టి
బ్రతుకు మత బోధకుల అనుగ్రహము తప్పి
సంఘ బాహ్యుండ నైతి క్రైస్తవుల యందు.

మధురవాణి : భావ కవిత్వం మీద కోపంగదా మీకు స్వామీ!

జాషువా : కమ్మని భావమ్ము గల ప
ద్యమ్మొక్కటి వ్రాయ జాల; వన్నిటిలో ము

గ్రద్మొ్మ ప్రణయమో్మ'' యని
యుమ్మలికించెదవు నీదియుం గననంబా?

మధురవాణి 'అభావ కవితా చిత్రాంగి' అన్నారు కదా! 'నీ కవనము పాడు గాను వెడగా! యిక నేనియు రమ్మి దారికిన్' అని వాళ్ళను తిట్టారు. రినైజాన్స్ యుగంలో వుండి దాన్ని తిట్టారు. భావ కవుల కాల్పనిక వాద యుగం మనకు సరాసరి దిగుమతి అయివచ్చింది. కాల్పనిక యుగంలోని భాగమే కథలూ నవలలూ గట్రా అని గిరీశంగారు చెప్పారు.

జాషువా మంచిది

''నా కవిత్వంబునందు రత్నములు గలవు
వాని బెకలించి చూపెడు వాఁడులేఁడు
కాల మిట్లున్న'' దని మొనగాఁడు వోలెఁ
బలుకు కవిగాడ యేటికి స్వాతిశయము?

మధురవాణి భావ కవులది కవిత్వం కాదని మీరు కాస్త వెనక పడ్డారు. ప్రేయసీ ప్రేయసీ అని గుండెలు బాదుకోడం మీకు నచ్చివుండదు. హైగా వైతాళికులు సంకలనంలో మిమ్మల్ని చేర్చ లేదు. మీ సత్యాగ్రహం సవబే

జాషువా ఆకాశం కేసి చూస్తూంటే అదిగో ఎంతో దూరాన కావలి దూరాన మృత్యువు నీడ బయల్దేరి నెమ్మదిగా వస్తూన్న ట్లనిపించేది. అది నీడేకాదు నీడ యొక్క నీడ అన్నాడు సంజీవదేవ్‌గారు నా మీద ఆప్యాయంతో!

మధురవాణి మీ పేర ఫౌండేషన్ పెట్టి హడావిడి చేస్తున్నారు హేమలత, బలరాం గారు.

జాషువా కవులు వ్యవస్థను ఎదిరించి నిలబడాలిగాని ప్రో ఎస్టాబ్లిషమెంటు కారాదు, మన ప్రభుత్వాలకు సాహిత్యం, చదువూ, సంస్కారాలు పట్టాయా? అంతా తంతు మాత్రమే.

మధురవాణి అసలు జ్ఞానపీఠ బహుమతికి మీరు అర్హులు.

జాషువా అర్హులకి ఎప్పుడైనా సరిఅయిన సత్కారాలు జరిగాయా? పుట్టపర్తి నారాయణాచార్యుల కంటెగొప్ప వాడెవడు చెప్పు. అందులో మాది గుంటూరు సీమ.

మధురవాణి ఎల్లలోకము లొక్క యిల్లై
వర్ణభేదము లెల్ల కల్లై
మతములన్నీ మాసిపోయి
జ్ఞాన మొక్కటి నిలచి వెలగాలి!
అని మా గురువుగారన్నారు.

జాషువా (మధుర వాణి బుజం చరిచి)
నా మీసాలు బాగున్నాయా?

మధురవాణి మీ కవితా సుందరితో కాని మీ మీసాలతో నాకేం పని? (నవ్వు)

# మార్క్యూజ్ 'కళాత్మక కోణం'

- బి. తిరుపతిరావు

1960, 70 మధ్య దశకంలో అమెరికా, జర్మనీ, ఫ్రాన్సులలో పెల్లుబికిన విద్యార్థి ఉద్యమాలకు తాత్వికనాయకుడు హెర్బర్ట్ మార్క్యూజ్. జర్మనీ లోని 'ఫ్రాంక్‌ఫర్ట్ స్కూల్ అనే మార్క్సిస్ట్ సిద్ధాంత కర్తల బృందంలో ప్రముఖుడు మార్క్యూజ్. జర్మనీలో హిట్లర్ అధికారంలోకి రాగానే మార్క్యూజ్ అమెరికా వలసవెళ్ళాడు. అక్కడ ఆయన మార్క్స్, హెగెల్, ఫ్రాయిడ్‌లను సమన్వయం చేసే ప్రయత్నం చేశాడు. ఆ క్రమంలో ఆయన 'రీజన్ అండ్ రివల్యూషన్' 'ఈ రోస్ అండ్ సివిలిజేషన్,' 'వన్‌డైమెన్షనల్ మాన్' అనే గ్రంథాలు రాశాడు. ఇవేకాక సోవియట్ మార్క్సిజాన్ని విమర్శిస్తూ 'సోవియట్ మార్క్సిజం' అనే పుస్తకాన్ని, మార్క్సిస్ట్ సాహిత్య విమర్శకి కొత్త పార్శ్వాన్ని చూపిస్తూ 'ద ఈస్థటిక్ డైమెన్షన్' అనే పుస్తకాన్ని కూడా రాశాడు.

ఒక సామాజిక శాస్త్రవేత్తగా, మార్క్సిస్ట్‌గా అర్థంచేసుకోకుండా అతని సాహిత్య సిద్ధాంతాన్ని అర్థంచేసుకోవడం సాధ్యంకాదు. మార్క్యూజ్ సామాజిక పరిశీలన ప్రముఖంగా సాంకేతికంగా అభివృద్ధిచెందిన సమాజాలకి సంబంధించిన దైనప్పటికీ ఈ మధ్య కాలంలో సాంకేతికంగా విస్తృతిపొందుతూ ఆ క్రమంలో నియంత్రుత్వపు ఛాయల్ని రూపొందిస్తున్న మనలాంటి సమాజాల్లోకూడా మార్క్యూజ్ పరిశీలనకి ప్రాముఖ్యంవుంది. అభివృద్ధిచెందిన దేశాల్లో నాగరికత మొత్తం ఒకేకోణం వైపు పయనిస్తుందని, కళలు, సాహిత్యం, తత్వశాస్త్రం, సైన్స్, రాజకీయార్థిక విషయాలు, సారాంశంలో మానవ ఆలోచన మొత్తం ఒకేకోణంలో సాగుతుందని దీనివల్ల సమాజ అభివృద్ధిక్రమానికి అత్యంత అవసరమైన విమర్శనా సూత్రం (critical principle) అనేది అంతర్థానమైందని మార్క్యూజ్ అభిప్రాయం ఉత్పత్తి రంగంలో చిన్న పరిశ్రమలన్నీ పెద్ద పరిశ్రమల్లో విలీనమై బహుళజాతి కంపెనీలుగా విస్తరించి పరిశ్రమల్లో totalization జరిగినట్లుగా విద్య, కళా సాంస్కృతిక రంగాల్లోకూడా Totalization జరిగిపోయింది ఇది మరింత ప్రస్ఫుటంగా ఆర్థిక రాజకీయ రంగంలో కన్పిస్తుంది. దేశంలో వివిధ రాజకీయ పార్టీల మధ్య భిన్నాభిప్రాయంవున్నట్లు బయటికి కన్పించినప్పటికీ అన్నింటి లక్ష్యాల్లో వున్న ఏక సూత్రత రాజకీయాల్లో 'టోటలైజేషన్' అనేదానికి ఉదాహరణ. ఈ టోటలైజేషన్ వల్ల ఆయా సమాజాల్లో తలెత్తే తిరుగుబాట్లని గానీ, విప్లవాల్నికానీ అణచి వేయడం ఆయా వ్యవస్థలకి సులభమైపోయింది. సమాజ చరిత్రలో క్రితం ఎప్పుడూ లేనటువంటి భిన్న అంశాల సమైక్యత (Integration of opposites) ఈ దేశాల్లో ఏర్పడింది. అందువల్ల రాజ్యం (State) అనేది విశేషంగా బలపడింది. ఈ ఏకకోణ సమాజం తనకి అవసరమైన ఏకకోణ మానవుణ్ణే (one dimensional man) రూపొందించుకుంది. మనిషికి సమాజంలో నామమాత్రంగానైనా వున్న స్వయం సిద్ధతని (autonomy) కూడా ఈ సమాజాలు ధ్వంసంచేశాయి. మనిషికి వ్యవస్థమీద ఏమాత్రం వ్యతిరేకత లేకుండా దాన్ని ప్రేమించేటట్టు బాల్యంనుంచీ వివిధరూపాల్లో అతని ఆలోచనని సాంఘికీ కరించారు. మనిషి చైతన్యాన్ని పత్రికలూ, రేడియోలు, టీవీల, ద్వారా అమలులోవున్న వ్యవస్థకి అనుసంధానించారు. 'ఈరోస్ అండ్ సివిలిజేషన్' అనే పుస్తకంలో మార్క్యూజ్ ఇలా అంటాడు· '' The over - powering of Education and Entertainment unites him with all the others in a state

of annasthesia from which all determental ideas to be excluded." అమలులో వున్న వ్యవస్థలు మంచీ-చెడూ, న్యాయం - అన్యాయం అనే విలువలు కేవలం వ్యక్తికి సంబంధించిన అంశాలు మాత్రమేనని భావించేటట్లు చేశాయి. ప్రేమ, ద్వేషం లాంటి అంశాలలో వ్యక్తిగతంగా వుండే స్వేచ్ఛనికూడా నియంత్రించే స్థాయికి ఈ వ్యవస్థలు చేరుకున్నాయి కళా, సాహిత్యాలు అమలులోవున్న వ్యవస్థని కీర్తించేట్టు చేయగలిగాయి ఈ సందర్భంలో నిజంగా సమాజాన్నిగురించి ఆలోచించేవాళ్ళ ఈ ఏకకోణ సమాజాన్ని ధ్వంసంచేయడానికి రెండవకోణాన్ని ( Second Dimension) రూపొందించే ప్రయత్నం చేయాలి సమాజ వాస్తవిక నిర్మాణంలో (structure of reality) గుణాత్మకమార్పు సాధించడానికి అమలులోవున్న అహేతుకతని బహిర్గతం చేసే ప్రయత్నం చేయాలి. ఈ గుణాత్మక మార్పుని సాధించేది ఇంతవరకూ కమ్యూనిస్టు లందరూ విశ్వసిస్తునట్లుగా కార్మికవర్గం కాదు. కార్మికవర్గం వ్యవస్థీకృతమై పోయింది. ఈ దశలో విద్యార్థులు, లుంపెన్ కార్మికవర్గం, మైనారిటీజాతులు మాత్రమే సామాజిక వ్యవస్థలో మార్పుకు కారణం కాగలరని మార్క్యూజ్ సిద్ధాంతీకరించాడు

పై సామాజిక నేపథ్యంలోంచి మార్క్యూజ్ తన కళా, సాహిత్యసిద్ధాంతాన్ని రూపొందించాడు. ఈ క్రమంలో ఆయన రాసిన 'ద ఈస్థటిక్ డైమెన్షన్' అనే పుస్తకం విశేషప్రాముఖ్యాన్ని సంతరించుకుంది ఈ పుస్తకంలో మార్క్యూజ్ మార్క్సిస్ట్ కళాసిద్ధాంతాలలో ఏర్పడివున్న సాంప్రదాయిక ధోరణిని స్పష్టంగా తిరస్కరించాడు సమాజ ఉత్పత్తి సంబంధాలని ఎంతవరకూ ప్రతిబింబించింది అనేదాన్ని ఆధారంచేసుకొని ఒకరచన గొప్పదనాన్ని నిర్ణయించడం సాంప్రదాయ మార్క్సిస్ట్ పద్ధతి. సాహిత్యంలో ప్రతిబింబించబడేది వాస్తవికత బాహ్య రూపం మాత్రమే కాదు, దాని అంతస్సారంకూడా! సాహిత్యానికి తన స్వంత భాష వుంటుంది. ఈ భాషలోనే ఇది వాస్తవికతను ఆవిష్కరిస్తుంది. కళాత్మకరూపం (Artistic form) సామాజిక సంబంధాలకు బయట స్వయం ప్రతిపత్తితో వుంటుంది. ఆ స్వయంప్రతిపత్తిలోనే సాహిత్యం అమలులోవున్న సామాజిక సంబంధాలని తిరస్కరిస్తూ అధిగమిస్తుంది. ఆవిధంగా అది అమలులో వున్న సాహిత్యభావజాలానికి వెలుపల తన స్వంత ప్రపంచాన్ని నిర్మించి సాహిత్యంలో అనుభవాన్ని విప్లవీకరించి చూపిస్తుంది. సాహిత్యంలో వాస్తవం అనేది అమలులోవున్న నాస్తికతను ఛేదించి ఏది నిజంగా నిజమో చూపించడంలో వుంటుంది. అలా చూపించడం ద్వారా సాహిత్యంలో కాల్పనిక ప్రపంచం వాస్తవిక ప్రపంచాన్ని ఆవిష్కరించినట్టువుతుంది. ఈ విధంగా సాహిత్య ప్రపంచం దానికదే ఒక వాస్తవిక సూత్రం (Reality Principle) ఈ సూత్రం అమలులోవున్న వాస్తవికతకు విముఖంగా వుంటుంది.

సాహిత్యం సహజంగా రెండు రకాలుగా విప్లవాంశ కలిగివుంటుంది. ఒకటి వ్యక్తీకరణ పద్ధతుల్లో తీవ్రమైన మార్పుల్ని ప్రవేశపెట్టడం, రెండు సమాజంలో వ్యక్తి స్థితిని స్వేచ్ఛారాహిత్యాన్ని. మార్మీకరింపబడిన వాస్తవికతని ఆవిష్కరించడం ద్వారా విప్లవాభిముఖంగా వుంటుంది. ఈ దృష్టితో చూసినప్పుడు అధివాస్తవికరచనలు, అభివ్యక్తివాదరచనలు మొదటి అంశం క్రిందకి వస్తాయి. రెండో అంశానికి ప్రతి గొప్ప సాహిత్యరచనా చెందుతుంది. ఎందుకంటే అది మన ఆలోచనల్ని విప్లవీకరిస్తుంది కాబట్టి.

రచనల్లో చారిత్రక పరిస్థితులు వివిధరకాలుగా ప్రతిబింబించబడతాయి. ఈ ప్రతిబింబించడం కొన్ని రచనల్లో బాహ్యంగావుంటే, కొన్ని రచనల్లో నేపథ్యంగా వుంటుంది

మరికొన్నింటిలో భాషలోనూ ఇమేజరీలోనూ వుంటుంది. కాఫ్కా, బ్రెఖ్ట్, బెకెట్ లాంటి రచయితల రచనల్లో వస్తువుకి (content) యిచ్చిన రూపం (form) గొప్పతనంవల్లే అవి విప్లవాత్మకరచనలయాయి. ఈ రచనల గొప్పదనం అర్థంచేసుకోవాలంటే, లేక విప్లవాంశని చూడాలంటే శైలీగతమైన పరిశీలన అనివార్యం. కొన్ని చారిత్రక సందర్భాలలో సాహిత్యంలో వస్తువుకంటే రూపానికి అధికప్రాధాన్యం యివ్వాల్సివస్తుంది. ఆ సందర్భంలో విమర్శకుడు వస్తువులో-కాక రూపంలోవున్న విప్లవాంశని పరిశీలించగలగాలి. తెలుగు సాహిత్యంలో పఠాభి లాంటి, దిగంబరకవుల్లాంటి వాళ్ళ కవిత్వాన్ని విశ్లేషించేటప్పుడు రూపకేంద్రక విమర్శ అవసరం

'తగిలింపబడియున్నది జాబిల్లి
చయినా బజారు గగనములోన; పయిన
అనవసరంగా అఘోరంగా'

అని రాసిన పఠాభి కవితలో మనం వెతకాల్సింది కవిత్వంగాదు రూపం. ఈ రూపంతోనే పఠాభి భావకవిత్వానికి 'దహన సంస్కారం' చేయగలిగింది 'ఫిడేల్ రాగాలు డజన్'లో కవిత్వంకంటే అకవిత్వమే ఎక్కువ. నారా అన్నట్లు 'కవిత్వం వేషం వేసుకొని అకవిత్వం తిరుగుతున్నప్పుడు కవిత్వం అకవిత్వ వేషంలో రావలసి వుంటుంది, దీన్ని నిర్వర్తించడం వల్లే పఠాభి ఆ చారిత్రక దశలో విప్లవకరపాత్ర నిర్వర్తించినట్లయింది అలాగే అరవయ్యవదశకంలో దిగంబరకవులు ప్రవేశపెట్టింది ఆ సందర్భంలో అత్యంత అవసరమయిన రూప విప్లవాన్నే. అలాగే డబ్భై అయిదు తర్వాత విప్లవకవిత్వంలో వస్తురూపాల సమన్వయంపోయి వస్తువుకి పెద్ద పీట వెయ్యడంతో కవిత్వం అకవిత్వమైపోయినప్పుడు ఎనభయ్యో దశకంలో రూపంమీద శ్రద్ధతో వచ్చిన కవిత్వంలో విప్లవాంశ అనివార్యంగావుంది.

వస్తువులో కూడా విప్లవాన్ని గురించి, శ్రామికుల్ని గురించి రాసిందిమాత్రమే విప్లవ సాహిత్యంకాదు. ఈ సందర్భంలో మార్క్యూజ్ ఇట్లా అంటాడు:'The Politicial potential of Art lies only in its own Aesthetic Dimension. Its relation to praxis is inexorably indirect.' ఈ దృష్టితో చూసినప్పుడు నినాదప్రాయమైన సాహిత్యానికంటే లేక విప్లవ కవిత్వానికంటే నిర్దిష్టమైన వస్తువుకి నిర్దిష్టమైన కళాత్మకరూపాన్నిచ్చిన కవిత్వంలో విప్లవాంశ ఎక్కువగా వుంటుంది. సాహిత్యానికి వర్గస్వభావం వుంటుందని సాహిత్యాన్ని భావజాలపరంగా పరిగణిస్తూ మార్క్సిస్ట్ విమర్శ క్రమంగా రచయితలకి ఒక పథకం ప్రకారం వస్తునిర్దేశం చేసింది. ఇది సహజంగానే ఎక్కువ సందర్భాలలో అసాహిత్యసృష్టికి కారణమైంది మార్క్సిస్ట్ విమర్శకులు ''సాహిత్యానికీ ఉత్పత్తి సంబంధాలకీ మధ్య నిర్దిష్టమైన సంబంధంవుంది, ఉత్పత్తి సంబంధాలలో మార్పు వచ్చినప్పుడు, ఉపరితలంలో భాగంగా కళాసాహిత్య స్వభావాలు కూడా మారిపోతాయి. పురోగామి వర్గాల సాహిత్యమే మంచి సాహిత్యం. అది వర్గచైతన్యాన్ని వ్యక్తం చేస్తుంది. పురోగామి వర్గ ప్రయోజనాల్ని సాహిత్యంలో ప్రవేశపెట్టాల్సిన బాధ్యత రచయితకు వుంది. వాస్తవికవాదం మాత్రమే ఖచ్చితమైన కళారూపం'' అని ఒక పథకీకరణ (Schematization) చేయడం వల్ల మార్క్సిస్ట్ సాహిత్య సృష్టిలో చాలాదారుణమైన ఫలితాలు వచ్చాయి ఈ వర్గీకరణ పునాది (Base) ఉపరితలం (Super Structure) ల గురించిన యాంత్రిక విశ్లేషణల ఫలితమే.

ఇది సారాంశంలో పునాదిని మాత్రమే గుర్తిస్తూ వ్యక్తి చేతననీ, అచేతననీ తిరస్కరించింది. ఇది అధమ స్థాయికి చెందిన గతితర్కమే. ఇక్కడ మార్క్యూజ్ వైయక్తికతగురించి ఇట్లా అంటాడు;

"Subjectctivity strove to break out of its inwardness into material and intellectual culture. And today, in the totalitarian period, it has become a political value as a counterforce against aggressive and exploitative socialization."

సాహిత్యం ఉత్పత్తి సంబంధాల చేత, వర్గంచేత నియంత్రించబడుతుంది అనే అభిప్రాయాన్ని మార్క్యూజ్ తిరస్కరించాడు. గొప్పరచనలన్నీ నిర్దిష్టమైన సాంఘిక పరిస్థితుల్ని అధిగమిస్తాయి. బానిస సమాజంలోనూ, తర్వాత ఫ్యూడల్ సమాజంలోనూ రాయబడ్డ గ్రీకు విషాదాంత నాటకాలు, ఇతిహాసాలు చదివి మనం ఎలా ఆస్వాదించగలుగుతున్నాం అనేదానికి "Introduction to the critique of political economy" లో మార్క్స్ చెప్పిన సమాధానం - మానవజాతి శైశవదశపట్ల మన కుండే ఆకర్షణే కారణంగా ప్రకటించడాన్ని - మార్క్యూజ్ అంగీకారయోగ్యం కాదంటాడు. సోషలిస్ట్ క్లాసిక్స్‌లో ఎలా అయితే రచయిత తన వర్గాన్ని ఛేదించుకొని రచనచేశాడని మనం అనుకుంటున్నామో, గొప్పరచనలన్నింటిలో అలాగే రచయిత కూడా తన వర్గాన్ని ఛేదించుకొని రచన చేస్తాడని గుర్తుంచుకోవాలి. సాహిత్యంలో అభ్యుదయ అంశాన్ని గుర్తించడానికి, రచయిత వర్గం ప్రాథమికం కాకూడదు. అలాగే అణిచి వేయబడ్డ వర్గాల జీవితం చిత్రించినంత మాత్రం చేత అది పురోగామి సాహిత్యం కానవసరం లేదు. రచనలో పురోగామి అంశాన్ని పరిశీలించడానకి రచనే కేంద్రం, రచయిత కాదు. ఆ రచన ఏమి ప్రతిపాదిస్తుంది, ఎలా ప్రతిపాదిస్తుందనేది ముఖ్యం.

మన సమాజంలో ప్రముఖంగా వుండే సాహిత్యరూపాలన్నీ సారాంశంలో అధికారంలో వున్న వర్గాల్ని పటిష్టం చేయటానికే వుంటాయి. ఆ క్రమంలో అవి స్వేచ్ఛారాహిత్య ప్రపంచానికి మాత్రమే చెంది వుంటాయి. వీటిని వ్యతిరేకించడానికి తర్కం, భాష అత్యవసరం అంటాడు మార్క్యూజ్. ఆయన దృష్టిలో "Reason is the negation of negative' సాహిత్యంలో భాషమీద శుద్ధవాస్తవాల ప్రభావం వుండకూడదు. ఈ భాషలో వస్తువు (Thing) అంతర్ధానమై వస్తువుకు సంబంధించిన అనుభవం మాత్రమే మిగులుతుంది. ఈ అనుభవమే పాఠకుడి మనసులో ఆలోచనను రేకెత్తిస్తుంది. ఈ పనిని సాహిత్యంలో సమర్థవంతంగా నిర్వహించగలిగింది అధివాస్తవిక కవులని మార్క్యూజ్ అభిప్రాయం. అందువల్లే ఆయన సర్రియలిస్టుల్ని ఎంతగానో అభిమానించాడు. బూర్జువా ఊహాత్మకతని, తర్కాన్ని, ఆలోచనా పద్ధతిని అధివాస్తవికులు తీవ్రంగా నిరసించారు. పెట్టుబడిదారీ అసంబద్ధతర్కపు అణచివేతని, అణిచి వేయబడ్డ మానవ సహజాతాల్ని ఆవర్గానికి వ్యతిరేకంగా సాహిత్యంలో విముక్తి చేయడంలో వున్న సామాజిక అంశని మార్క్యూజ్ గుర్తించాడు. అధివాస్తవిక సాహిత్యంమొత్తం బూర్జువా తర్కంమీద, మధ్యతరగతి నీతులమీద సాంస్కృతిక దాడిగా, తిరుగుబాటుగా ఆయన భావించాడు.

# మానవ అవయవముల మార్పిడి చట్టం

- ఎస్.కె. ఆచార్య

ఒకప్పుడు మానవావయముల అమ్మకాలు కొనుగోళ్లు చాలా విరివిగాను బహిరంగంగాను జరుగుతూ ఉండేవి. వాటి ధరలు కూడా ఆకాశాన్ని అంటుకుని ఉండేవి. ఒక్కొక్క మూత్రపిండం రూ. 20,000/- నుండి లక్ష దాకా అమ్ముడు పోయేది. పరిస్థితులను బట్టి బేరసారాల నైపుణ్యాన్ని బట్టి రెండు మూడు లక్షలు కూడా చెల్లించినట్లు వార్తలున్నాయి. మానవ అవయవముల వ్యాపారంలో దళారులు ప్రవేశించడంతో ఈ వ్యాపారం చాలా పిచ్చి దోవలను త్రొక్కడం ప్రారంభించింది. ఎడ్వర్‌టైజ్‌మెంట్ల ద్వారా నీతి నియామావరోధాలు దాటిన ఈ వ్యాపారం అవయవాలను దానం చేసేవారికి, అవయవాలను స్వీకరించే వారికి చాలా ప్రమాదాలను తెచ్చి పెట్టింది. అవయవాలను ఇచ్చే వారికి డబ్బు ముఖ్యం. అవయవాలను పొందేవారికి అవయవం ముఖ్యం. మధ్య దళారీలకు కమీషన్ ముఖ్యం. ఆపరేషన్‌ను ఏ డాక్టరైనా చేయవచ్చు. ఎక్కడైనా చేయవచ్చు. ఎవరూ ఎవరికీ బాధ్యులు కారు. అవయవాల మార్పిడి వలయంలో చిక్కుకున్నవారు ఆరోగ్యాన్ని శాశ్వతంగా కోల్పోవడమే కాకుండా అనుచిత అవయవాల మార్పిడికి గురియైన వారు ప్రాణాలను కోల్పోయిన సందర్భాలు కూడా చాలా ఉన్నాయి.

అవయవాల మార్పిడి మెడికల్ సైన్సు అందచేసిన ఒక మహత్తర అస్త్రం. ఒకరి శరీరంలో విగరస్‌గా పనిచేస్తున్న అవయవాన్ని తీసి, మరొకరి శరీరంలో చెడిపోయిన అవయవం స్థానంలో పునస్థాపితం చేయడం, జీవితం అంతమయిందని దిగులు పడేవారికి పునర్జన్మనిచ్చింది. ఈ సాధన దుర్వినియోగాన్ని అరికట్టేందుకై ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వం మానవాయవముల మార్పిడి చట్టం (ఎ.పి. ట్రాన్స్ ప్లాంటేషన్ ఆఫ్ హ్యూమన్ ఆర్గాన్స్ ఆక్ట్) అనే చట్టాన్ని రూపొందించి, 9వ మార్చి, 1995 సం. నుండి అమలుకు తెచ్చింది.

మానవావయముల మార్పిడి చట్టం అమలుకు వచ్చిన తేది నుంచి, అవయవాల మార్పిడి చట్టంలో నిర్వచించిన షరతుల ప్రకారం, చట్టం ఆదేశించిన విధానాన్ని అనుసరించి మాత్రమే జరగాలి. అర్హతలు కల డాక్టర్లుందరూ అవయవాల మార్పిడి ఆపరేషన్ చేయవచ్చు. కాని, ఆపరేషను ప్రభుత్వం చేత గుర్తింపు పొందిన హాస్పిటల్‌లోనే చేయాలి. ఆపరేషను ప్రారంభించే ముందు అవయవాన్ని ఇచ్చేవారి ఆరోగ్య పరిస్థితిని అవయవాన్ని పొందేవారి ఆరోగ్య పరిస్థిని క్షుణ్ణంగా పరిశీలించి అవయవాల మార్పిడి వలన వారిరువురికి ప్రమాదం ఏది ఉండబోదని అవయవాన్ని స్వీకరించేవారి ఆరోగ్యం మెరుగుపడుతుందని ఆపరేషన్ చేసే డాక్టరు తన సంతృప్తిని లిఖిత పూర్వకంగా ధృవపరచాలి. ఆపరేషన్ చేసే డాక్టర్ వారిరువురికి ఆపరేషన్‌లోని ప్రమాదాలను, ఫలితాలను, వివరించి అవయవాల మార్పిడికి ఉభయుల అనుమతి పొందిన అనంతరం ఆపరేషన్‌ను చేయాలి. అవయవాన్నిచ్చిన దాత యొక్క తదుపరి ఆరోగ్య పరిరక్షణా భారం అంతా ఆపరేషను చేసిన డాక్టర్ పైన, అవయవాన్ని స్వీకరించిన వారిపైన ఉంటుంది.

అవయవాన్ని దానం చేసేవారు అవయవాన్ని స్వీకరించేవారికి దగ్గర బంధువు అనగా భార్య, భర్త, కుమారుడు, కుమార్తె, తల్లి, తండ్రి సహోదరుడు, సహోదరి ఐనట్లయితే వారి

అనుమతితో అవయవాల మార్పిడిని చేయవచ్చు. అవయవాన్నిచ్చే దాత దగ్గర బంధుత్వం లోపలి వ్యక్తి కాక దూర బంధువు, సన్నిహితుడు, స్నేహితుడు అయితే ప్రభుత్వంచే నియమించబడిన ఆథరైజేషన్ కమిటీ అనుమతిని ముందుగా పొందవలసి ఉంటుంది. అవయవాన్ని ఇచ్చే దాత అవయవ గ్రహీత ఇద్దరూ కలసి సమర్పించే అర్జీని పరిశీలించిన ఆథరైజేషన్ కమిటి ఆపరేషన్ చేసేందుకు అనుమతిని ఇస్తుంది. ఇరువురూ కలసి దాఖలు చేసే అర్జీలో అవయవ దానానికి కారణం వారిరువురి మధ్య ఉన్న ప్రేమ, స్నేహం, దాన ప్రవృత్తి, మొదలైన మానవ ఔదార్యాన్ని సూచించే కారణాలను చూపాలి. ధనాన్ని ఇచ్చినట్లు పుచ్చుకొన్నట్లు చూపించరాదు. ఆపరేషను కొరకు అయే ఖర్చుల క్రింద, ఆపరేషన్ తరువాత అవసరమయ్యే వైద్య సహాయం కొరకు ఆపరేషను వలన కోల్పోయే ఆదాయానికి పరిహారంగా అవయవ దాతకు ఇచ్చే మొత్తాలు నిషిద్ధాలు కావు.

మానవావయవముల మార్పిడి చట్టంలో మరికొన్ని ముఖ్యమైన విషయములు కూడా ఉన్నాయి. పైనచెప్పిన విధానం అంతా జీవించి ఉన్న వ్యక్తి తాను జీవించి ఉండగానే తన శరీరంలోని ఒక అవయవాన్ని తీసి, మరొకరి శ్రేయస్సు కొరకు వారి శరీరంలో చేర్చేందుకై దానం చేయదలిస్తే అనుసరించవలసిన పద్ధతి. ఇక జీవించి ఉన్న వ్యక్తి తన జీవితం అంతమైన తరువాత శరీరంలోని అవయవాలను వేరొకరి ఉపయోగార్థం విడదీసేందుకు ఇష్టపడిన యెడల దానిని తీసి హాస్పిటల్స్‌లో భద్రపరిచేందు కొరకు అనుసరించ వలసిన విధానాన్ని కూడా చట్టం రూపొందించింది. అదే విధంగా హాస్పిటల్స్‌లోను, జైళ్లలోను అనాధలుగా చనిపోయేవారి శరీరాల నుంచీ, ప్రమాదంలో ప్రాణాలు కోల్పోయిన వారి శరీరాల నుంచి భవిష్యత్తులో అవయవాల అవసరం ఉండేవారి ఉపయోగార్థం అవయవాలను తీసి భద్రపరిచే విధానాన్ని కూడా ఈ చట్టం ప్రస్తావించింది.

గతించినవారి శరీరం నుంచి అవయవాలను తీయాలంటే ఆ వ్యక్తి జీవించి ఉండగా ఇద్దరు సాక్షుల సమక్షంలో సంతకం చేసి ఇచ్చిన ఆథరైజేషన్ ఒకటి ఉండాలి. అటువంటి ఆథరైజేషన్ ఏదీ లేకపోతే చనిపోయినవారి దగ్గర బంధువుల అనుమతిపైన అవయవాలను తీయవచ్చు. దగ్గర బంధువులు అంటే అందరు బంధువులు అని అర్థంకాదు. కుమారుడు, కుమార్తె, తండ్రి, తల్లి, సోదరుడు, సోదరి, అనే వరుస క్రమంలో ఒకరు లేకపోతే ఆ తరువాత వారు అనుమతి ఇవ్వవచ్చు. కుమారుడు తండ్రి శరీరం నుంచి, అవయవాలను తీసేందుకు అనుమతిని ఇవ్వక పోతే కుమార్తె అనుమతి ఇచ్చేందుకు వీలు లేదు.

జైళ్లలోను, ఆస్పత్రులలోను, ప్రమాదాలలో చనిపోయిన వ్యక్తుల నుండి అవయవములను తీయాలంటే అథరైజేషన్ ఇచ్చే వ్యక్తులు ఎవరూ లేనప్పుడు ఆ శరీరాన్ని చట్ట పరంగా ( లాఫుల్) స్వాధీనంలో ఉంచుకొన్నవారి అనుమతి సరిపోతుంది.

ఐతే ఇక్కడ అవయవాలను తీసే ముందు వ్యక్తి చనిపోయినాడా లేదా? ఎప్పుడు ఏక్షణంలో ఆ వ్యక్తి చనిపోయినట్లుగా భావించాలి? అనే సమస్యలపై ముందుగా ఒక నిర్ణయం చేయవలసి ఉంది. వ్యక్తి చనిపోయిన అనంతరం ఆయన శరీరం నుంచి, అవయవాలను తీసే అర్హత డాక్టర్లకు వస్తుంది. శాస్త్రీయ ప్రమాణాల ప్రకారం వ్యక్తి, చనిపోక ముందు ఆయన శరీరం నుంచి

అవయవాలను తీస్తే అది నేరం అవుతుంది. అందుచేత చావు అంటే ఏమిటి? చావు అనే పరిస్థితిని నిర్ణయించడం ఎలా? అనే ప్రశ్నలకు ఈ చట్టం విశ్లేషణలను ఇచ్చింది.

చావును రెండు విధానాలలో నిర్ణయించ వచ్చు. ఒకటి శ్వాస నిశ్వాసలు, రక్త ప్రసరణ, నరాల స్పందన, గుండె శ్వాసకోశాలు స్తంభించిపోగా ప్రాణాన్ని స్ఫురించే గుణాలు యేవీ శరీరంలో లేకపోవడం చావు. ఈ విధమైన చావును ఏ డ్క్టారైనా నిర్ణయించవచ్చు. అయిదు నిమిషాలు పైబడిన కాలం పాటు పైన చెప్పిన పరిస్థితులు శరీరంలో కొనసాగితే వ్యక్తి చనిపోయినట్లు భావించాలి. శవ పరిశీలనా నంతరం వ్యక్తి చనిపోయినట్లు డాక్టరు నిర్ధారణ చేసి సర్టిఫికెట్ ఇచ్చిన తరువాత అవయవములను శరీరం నుంచి తీయడం ప్రారంభించాలి. ఇక రెండవ విధానపు చావు బ్రెయిన్ స్టెండెత్. ఇక్కడ శ్వాస నిశ్వాసలు రక్తప్రసరణ నామమాత్రానికి పనిచేస్తున్నట్లు కనపడినా - మనిషి నిజానికి అంత్య ఘడియలలో కొంత కాలంపాటు జీవిస్తున్నట్టే కనబడతాడు. అది పూర్తిగా ఒక అచేతన (వెజిటెటివ్) జీవితం. డీప్ కోమాలో ఉన్న ఆశరీరానికి స్పృహ స్పందన ఏమి ఉండవు. ప్రమాదాలలో తీవ్రంగా గాయపడినవారు, మెదడుకు దెబ్బతగిలిన వారు, మందులు పనిచేయకుండా పోయి టెర్మినల్ డిసీజెస్‌తో ఆఖరి ఘడియల బాధను అనుభవిస్తున్నవారి పరిస్థితి బ్రెయిన్ స్టెం డెత్‌కు దారి తీస్తుంది. శరీరంలో ఈ పరిస్థితి ఏర్పడేందుకు కారణం మెదడులోని కొద్ది స్థానాలు మాత్రమే పనిచేస్తూ ఉండటం. మిగిలినవన్నీ అప్పటికే క్షీణించిన పరిస్థితిలో ఆ కొద్ది స్థానాలు కూడా స్తంభించినప్పుడు చావు స్థిరపడుతుంది. కనుక దానిని బ్రెయిన్‌స్టెం డెత్ అని అంటారు. మొదటి విధానపు చావులో బ్రెయిన్‌తో సహా అన్ని అవయవములు పనిచేయడం మానేస్తాయి . రెండవ విధానపు చావులో బ్రెయిన్ స్టెమ్ డెత్ సంభవించేంత వరకు ఇతర అవయవాలు కొన్ని పనిచేస్తుండవచ్చు. కనుక సాధారణమైన చావును ఏడ్క్టారైనా నిర్ధారణ చేసి సర్టిఫికేట్‌ను ఇవ్వవచ్చు. కాని, బ్రెయిన్ స్టెం డెత్‌ను స్పెషలిస్టు డ్క్టరు నిర్ధారణ చేసి సర్టిఫికెట్‌ను ఇవ్వవలసి ఉంటుంది సర్టిఫికెట్ ఇచ్చే ముందు మెదడుకు సంబంధించిన ఎలక్ట్రికల్ స్టిమ్యులస్‌కి స్పందన ఉన్నది లేనిది ఆరు గంటల విరామంలో రెండు సార్లు పరీక్షచేసి, ఎలక్ట్రికల్ స్టిమ్యులస్‌గోచరించక పోయినప్పుడు బ్రెయిన్‌స్టెమ్ డెత్‌సంభవించినట్లు స్పెషలిస్టు తెలుసుకోవాలి. అందుచేత బ్రెయిన్ స్టెం డెత్ కేసులలో స్పెషలిస్టులు చట్టంలో నిర్ణయించిన షరతుల ప్రకారం పరీక్షలు చేసిన తరువాత ఇచ్చిన సర్టిఫికెట్ ఆధారం చేసుకొని మాత్రమే అవయవాలను చనిపోయినవారి శరీరం నుంచి తీయవలసి ఉంటుంది. ఇటువంటి కేసులలో అచేతన జీవితం ఎంతకాలంపాటు ఉంటుందో చెప్పడం సాధ్యపడదు కనుక చావు సంభవించేంతవరకు వేచి ఉండవలసి వస్తుంది తొందరపడి ముందుగా అవయవాలను తీసే ప్రయత్నం చేయరాదు

మానవావయవముల మార్పిడి ఆపరేషను ప్రభుత్వం నుంచి ప్రత్యేకముగా రిజిస్ట్రేషను పొందిన హాస్పిటల్స్‌లో తప్ప ఇతర హాస్పిటిల్స్‌లో ఎక్కడ చేయరాదు రెండు దశాబ్దాలకు పూర్వం చాలా క్లిష్టమైనదిగా భావించబడిన ఈ ఆపరేషను ఇప్పుడు కాంప్లికేటెడ్‌కాదు. ఐనప్పటికి ఆపరేషను చేసేందుకు తీసిన అవయవాన్ని మరొకరి శరీరంలో స్థాపించేందుకూ లేక భద్రపరచేందుకు కావలసిన వసతులను అన్నిటినీ గురించి చట్టం ఒక జాబితాను తయారు చేసింది ఉత్తమ విద్యార్హత స్పెషలిస్టు అనుభవం కల డ్క్టర్లు, ఎనస్తీషియా, ఐసియు/హెచ్‌డియు, లేబరేటరీ,

ఇమేజింగ్, హెమొటాలజీ బ్లడ్ బ్యాంక్, డయాలసిస్ శాఖలలో ఆధునిక యంత్రాలు, తరిఫీదు అయిన పనివారు ఉన్న ఆస్పత్రులకు అప్రాయింటెడ్ అథారిటి రిజిస్ట్రేషన్‌ను మంజూరు చేస్తుంది. రిజిస్ట్రేషన్‌ను పొందిన తరువాత వసతులలో ఎవయినా లోపాలు కనబడినచో హాస్పిటల్‌కు ఇచ్చిన రిజిస్ట్రేషన్ రద్దుపరచే అధికారం ప్రభుత్వం తరపున అప్పాయింటెడ్ అధికారికి ఉంది.

మానవ అవయవములతో వ్యాపారాన్ని నిషేధిస్తూ నిజముగా అవయవము అవసరమున్నవారికి నిజాయితీగా అవయవాన్ని ఎవరయిన దానం చేసేందుకు సిద్ధపడితే వారిరువురికీ క్షేమకరంగా అవయవ మార్పిడిని సమర్ధవంతంగా జరిపించేందుకు ఉద్దేశించిన ఈ చట్టం దాని ఆశయాలను భంగపరిచే వ్యక్తులను శిక్షిస్తుంది. సరిఅయిన ఆథరైజేషన్ లేకుండా అవయవ మార్పిడి చేసినా, అవయవాన్ని బజారు వస్తువు మాదిరిగా ధరకు అమ్మినా అమ్మచూపినా, అవయవములలో దళారి వ్యాపారంచేసినా ఆ వ్యాపారానికి సంబంధించిన ఎడ్వర్‌టైజ్‌మెంట్లను ప్రకటించినా, రిజిస్ట్రేషన్ పొందిన హాస్పిటల్ రిజిస్ట్రేషన్ షరతులకు భిన్నంగా ప్రవర్తించినా వీరందరూ చట్టం క్రింద శిక్షార్హులు. కేసును విచారించిన మొదటి శ్రేణి మేజిస్ట్రేట్ ముద్దాయిలపై తప్పకుండా జైలు శిక్షను విధించ వలసి ఉంటుంది. అంతకంటె తక్కువ శిక్షను విధించే అధికారం మేజిస్ట్రేటుకు లేదు. ఈ చట్టం క్రింద క్రిమినల్‌కేసును దాఖలు చేసే అర్హత మొదటిగా అప్పాయింటెడ్ అదారిటికి ఉంది ఇతరులు ఎవరైనా కేసును కోర్టులో దాఖలు చేయ తలిస్తే వారు ముందుగా ఒక నెల నోటీసును అప్పాయింటెడ్ అథారిటీకి ఇచ్చి, ఆ తరువాత తమంత తాముగా క్రిమినల్ కోర్టులో కేసును నమోదు చేయవచ్చు.

ఒకసారి శరీరం నుంచి అవయవాన్ని తీస్తే అది పునరావృతం అయ్యేందుకు సావకాశం లేని అవయవాలకు మాత్రమే మానవావయముల మార్పిడి చట్టం వర్తిస్తుంది. ఇతర అవయవాల మార్పిడికి ఈ చట్టం వర్తించదు. రక్తం, రక్తనాళాలు, స్కిన్‌గ్రాఫ్టింగ్, బోన్‌మేరో మార్పిడులు ఈ చట్టం క్రిందకు రావు.

జీవించి ఉన్న శరీరంలోంచి తీసి మరొక వ్యక్తి శరీరంలో అమర్చేందుకు అనువైన అవయవం ప్రస్తుతానికి కిడ్నీ ఒక్కటే చనిపోయిన వ్యక్తి శరీరం నుంచి తీసి భద్రపరిచి, వేరొకరి శరీరంలో అమర్చేందుకు అనువైన అవయవాలు కళ్లు, చెవి, కిడ్నీ, గుండె, లివరు. ఈ అయిదు అవయవాలు కాక మధుమేహంతో బాధపడేవారి కొరకు పాంక్రియాస్‌ను కూడా తీయవచ్చు కాని ఈ అవయవమార్పిడి మధుమేహ బాధితులకు ప్రస్తుతంలో అంత ఆశాజనకంగా లేదు. కళ్లను రెండు గంటలలోపల భద్రపరచాలి. ఇతర అవయవాలను సాధ్యమైనంత తొందరగా చనిపోయినవారి శరీరం నుండి తీస్తేనే అవి వేరొకరికి ఉపయోగపడతాయి.

చర్మాన్ని ఒక శరీరం నుంచి తీసి మరొక శరీరానికి అతికించడం అనే ప్రక్రియ క్రీస్తుశకం 1500సం. క్రితం నుంచి అనుసరిస్తున్నట్లు సాక్ష్యాధారాలున్నాయి. కంటితెల్లపొర (కొరనియా) మార్పిడి బోన్‌మేరో మార్పిడి గత నూటయాభై సంవత్సరముల నుంచి జరుగుతున్నాయి. పూర్తి అవయవాలమార్పిడి ఈ శతాబ్దం మొదట్లో ప్రారంభం అయింది. ఎలక్సిస్ కారెల్ (Alexis

Carrel) అను వైద్య శాస్త్ర నిపుణుడు అవయవాల మార్పిడికి నాంది పలికిన వారిలో ప్రథముడు. ఒకరి అవయవాన్ని మరొకరి దేహంలో అమర్చినప్పుడు స్వీకరించిన శరీరం కొత్తగా వచ్చిన అవయవాన్ని తిరస్కరించడం చాలా చోట్ల తటస్థపడుతున్నందున అవయవముల మార్పిడికి పేషంట్లు మొదట్లో ఎక్కువగా సిద్ధపడేవారు కాదు. ఈ తిరస్కరణకు ఇరుగుడు మందులను 1960 లో కనుగొన్నప్పటి నుంచి అవయవాలు మార్పిడికి పేషంట్లు నిర్భయంగా సిద్ధపడుతున్నారు. ప్రపంచ వ్యాప్తంగా జరిగే అన్ని ఇపరేషన్‌లలో 95 శాతం వరకు కిడ్నీ ఆపరేషనులు జయప్రదమౌతున్నట్లు అంచనా. ఏకారణం చేతనైనా కొత్తగా అమర్చబడిన కిడ్నీ పనిచేయకపోయినచో పేషంట్లను డయాలసిస్ ట్రీట్‌మెంటుకు మార్చవచ్చు. లివర్ మార్పిడిలలో అవయవాలను మార్చుకున్నవారు దాదాపు 10 సంవత్సరముల పాటు ఉత్సాహముగా జీవిస్తున్నట్లు తెలుస్తోంది. కిడ్నీ ఆపరేషను చేయించుకున్నవారి ఆరోగ్యం కూడా అంతకంటే ముందు ఉన్న ఆరోగ్యాని కంటే హెచ్చు దశలో అనుభవిస్తున్నట్లు కేసు రిపోర్టులు ధృవపరుస్తున్నాయి.

మానవావయవముల మార్పిడి చట్టం అవయవ సేకరణను ఇంతకు ముందు కంటే సులభతరం చేసి ఉండవలసింది. కాని ఆవిధంగా జరగలేదు. ఇంతకు ముందు అమలులోవున్న అవయవ మార్పిడీలకు సంబంధించిన చట్టాలు ఏవి అనగా ఆంధ్రప్రదేశ్ కార్నియల్ గ్రాఫ్టింగ్ ఆక్టు 1963, ది ఇయర్ డ్రమ్స్ అండ్ ఇయర్ బోన్స్ ( అథారిటీ ఫర్ యూజ్ ఫర్ థెరప్యేటిక్ పర్‌పసెస్ ఆక్టు 1982. వివాదాలకు వేటికి గురి అవ్వక పోయినప్పటికీ అవయవ సేకరణకు ముందుగా పొందవలసిన అనుమతులను షరతులను తేలిక పరచే బదులు ఈ చట్టం కఠిన పరచింది. చనిపోయిన వారి శరీరాల గురించి ఉండే సెంటిమెంటుపై బహుశా ఆధారపడి ఈ అంశంపై చట్టం విధించిన షరతులు ప్రోత్సాహకరంగా లేవు. జీవించి ఉండగా వ్యక్తులు ఇచ్చే అనుమతి పత్రం పై వారి దగ్గర బంధువులు సాక్షి సంతకాలు చేయాలనే షరతు, జీవించి ఉండగా ఇచ్చిన అనుమతి ఉప సంహరణ జరగలేదనేందుకు సాక్ష్యం ఉండాలనే షరతు, అవయవములను తీసే ఆఖరి దశలో చాలా చిక్కులకు దారితీస్తాయి. దగ్గర బంధువులు కానివారి అనుమతి అవసరము అనే పరిస్థితులలో వారి నుంచి అనుమతికి బదులు సహేతుకమైన అభ్యంతరాలు ఏమీ లేకపోతే అవయవములను చనిపోయిన వారి శరీరం నుండి తీయవచ్చును అని ఉంటే బాగుండేది.

అవయవములను ఐచ్ఛికంగా దానం చేసే వారి స్వేచ్ఛకు అడ్డు తగిలే సావకాశం వేరొకరికి, వారెంత బంధువులయినా, ఇవ్వడం మంచిది కాదు. అదే విధంగా దగ్గర బంధువుల తిరస్కృతి లేనంత వరకు చనిపోయిన వారి శరీరంలోని అవయవాలను తీసేందుకు వేరొకరి అభ్యంతరానికి గుర్తింపు ఉండరాదు.

ఈ మధ్య ఒకే మృత శరీరం నుంచి కళ్లను, రెండు కిడ్నీలను తీసి అదే హాస్పిటల్‌లో చికిత్స పొందుతున్న ముగ్గురు వ్యక్తులకు అమర్చడంతో ఒకరికి దృష్టి, ఇద్దరికి పునర్జన్మ లభించింది. కుమారుని శరీరం నుంచి అవయవములను దానం చేసిన మహామనిషి అభినంద నీయురాలు. ఇటువంటి సంఘటనలు తరచు సంభవించ గలవని ఆశించవచ్చు.

# వియోగబాధ

-అన్నపరెడ్డి వెంకటేశ్వర రెడ్డి

వీడుకోలు, బైబై, టాటా, సెలవు అని చెబుతూ మిత్రుల దగ్గర సెలవు తీసుకొంటూ ఉంటాం సెలవు తీసుకోవడం అంటే ఒకరి కొకరు కాల దేశాల్లో దూరం అవుతున్నారన్నమాట. ఈ దూరం అవడమనేది చాల బాధాకరమైన సంఘటన. ప్రేయసీ ప్రియుల మధ్య సెలవు విరహానికి దారితీస్తుంది. వాస్తవంలో విరహం, ఎడబాటు కూడ సెలవు పుచ్చుకోవడాలే. విరహం కేవలం శృంగార పరమైనదే కాదు. దానిని విస్తృతార్థంలో వాడితే అన్ని రకాల వీడ్కోళ్ళకు వర్తిస్తుంది. ఒక స్కూలు వదిలి మరోస్కూలులో చేరడం, ఉద్యోగరీత్యా ఊళ్ళు మారడం, బ్రతుకుతెరువు కోసం ఉన్న ఊరువదిలి వలసవెళ్ళడం, చదువురీత్యా విదేశాలకు పోవడం- ఇవన్నీ కూడ వియోగసందర్భాలే

అయితే అన్ని వియోగాలు అంత తీవ్రమైనవి, దుఃఖ భాజకాలు కాకపోవచ్చు. తీవ్రత అనుబంధాల తీవ్రత మీద ఆధారపడి ఉంటుంది. అయినా దాదాపు అన్ని రకాల ఎడబాట్లు వ్యక్తి అస్తిత్వ గర్భకుహరాన్ని అంటే మూర్తిమత్వశీల లక్షణాన్ని కదిలించి వేస్తవంటారు చాలమంది మనోవిజ్ఞాన శాస్త్రజ్ఞులు. కదిలించేమాట నిజమే అయినా, ప్రతి వియోగ సందర్భానికి దాని ప్రత్యేక లక్షణాలు దానికి ఉన్నాయి. దాని అంతర్గత సమస్యలు దానికి ఉన్నాయి. దాని బాధలు, ఆశలు, ఆశంసలు దానికి ఉన్నాయి. దేని ప్రత్యేకతలు దానికి ఉన్నా తీవ్రమైన ఎడబాట్లు అన్నింటికి కొన్ని సామాన్య లక్షణాలు ఉంటాయి మనోవిశ్లేషకులు ఈ ఎడబాట్ల వెనక ఉన్న గతిశీలతలను అధ్యయనం చేశారు.

ఉద్యోగాలను మార్చడం, విడాకులు లాంటి వియోగ సన్నివేశాలను ప్రవర్తన మనోవిజ్ఞాన శాస్త్రజ్ఞులు అధ్యయనం చేశారు. ఏదైనలోతుగా పాతుకు పోయినసంబంధాలున్న సన్నివేశాలనుంచి వీడ్కోలు పుచ్చుకొనేటప్పుడు మనుషుల్లో తమ జీవితాల్లోని చిన్న నాటి గాఢ అనుభూతులు, సంవేదనలు వెలికి వస్తాయి కొంత మందిలో అయితే తాను ప్రప్రథమంగా వేరే మనిషిగా ఆవిర్భవించిన నాటి జాగృతి పునరావృతమవుతుంది ఏ వ్యక్తీ పుట్టిన నాటి నుంచి వేరే ప్రత్యేక వ్యక్తిగా ఉండడు. బిడ్డ గర్భంలో ఉన్నా, ప్రసవం తరవాత బాహ్య ప్రపంచంలోకి వచ్చినా ఆ బిడ్డ తల్లి కంటె భిన్నం కాదు తల్లిలో భాగంగానే ఉంటుంది. ఆ తరవాత క్రమేణ ఈ ప్రపంచంలో ఇతర వ్యక్తులకు ప్రతిస్పందిస్తూ తానొక ప్రత్యేకమైన వేరే వ్యక్తిగా రూపొందుతాడు అలా రూపొందడంలో ''నేను'' లేక ''తాను'' అనే భావనను గుర్తిస్తాడు. ఇలా గుర్తించడంలో కొంత ఆవేదనకు, వ్యాకులతకు గురవుతాడు. పెద్దైన తరవాత ఈ వియోగ సన్నివేశాలలో నాటి వేరు తనపు సంవేదనలు పెల్లుబికి వస్తాయి. ఇటువంటి గత తొలి అనుభవాలు కారణంగా నిస్సహాయత కోపం, కుంగిపోవడం లాంటి ఉద్వేగాలు వ్యక్తిలో ఉపరితలానికి వచ్చి విరహ సమయంలో తికమక ఏర్పడుతుంది

''నేను పలాన'' అనే భావన ఏర్పడడాన్ని ''తాదాత్మ్యత'' అంటారు. తల్లి నుంచి బిడ్డ వేరు పడడం - తను తల్లి కంటె వేరే వ్యక్తినని గుర్తించడం - లోని బిడ్డ అనుభవాల చుట్టూ తాదాత్మ్యత పరిభ్రమిస్తుందని మార్గరెట్ మాహ్లెర్ అంటున్నారు. దీనిని చాలమంది మనో విజ్ఞానశాస్త్రజ్ఞులు సమర్థిస్తున్నారు. జాన్ బౌల్బీ అనే సైకియాట్రిస్ట్ ఈ వేరు తనం - బిడ్డ తల్లి నుంచి వేరు వ్యక్తిగా రూపొందడం - పై పరిశోధనలు సాగించాడు. బిడ్డ తల్లి నుంచి వేరు పడడంలో కలిగే వ్యాకులత మనిషిని జీవితాంతం వదిలిపెట్టదు. ఆకారణాన మనుష్యులు ఎప్పుడు కూడా పరిచిత స్థలాలలో,

పరిచిత వ్యక్తుల దగ్గర భద్రతను అనుభవిస్తారు. వియోగం అంటే పరిచిత వ్యక్తులను స్థలాలను వదిలి వెళ్ళడమే కాదా. అందుకే బాధ.

ఈ వియోగ బాధను మనం ఫ్రాయిడ్ స్థిరీ భవనం (Fixation)తో ముడి పెట్టవచ్చు. స్థిరీభవనం చెందిన వ్యక్తి అడుగు ముందుకు వేయలేడు. అడుగు ముందుకు వేయడమంటే తెలిసిన స్థానం నుంచి తెలియని చోటులోకి అడుగు వేయడమే మరి తెలియని చోట ఎటు వంటి అనుభవాలు ఎదురవుతాయోనని భయం. ఈ విషయం మనకు పిల్లవాణ్ణి బళ్ళో వేసే రోజు అవగతమవుతుంది. పిల్లవాడు మొదటి రోజు భయం భయంగా, అనుమానంగా వెళతాడు. అలాగే విద్య పూర్తిచేసుకొని చివరి రోజు కళాశాల నుంచి వాస్తవ ప్రపంచంలోకి అడుగిడే విద్యార్థి తన జీవితం ఇక మీదట ఎలా ఉంటుందోనని భయ పడతాడు అందుకని కళాశాలలోనే ఉండిపోవాలని పిస్తుంది. కొత్తగా వ్యాపారం ప్రారంభించేవాడూ అంతే. పాతదీ పరిచితమూ అయిన సన్నివేశం నుంచి కొత్తదీ, అపరిచితమూ అయిన సన్నివేశంలోకి అడుగిడే టప్పుడు ఎదురయ్యే అనుభవాన్ని వియోగ వ్యాకులత (Separation anxiety) అంటారు. పాతను వదలలేడు కొత్తను కౌగిలించుకోలేడు. ఇదొక వికల్పస్థితి, ద్విసంగ వేగస్థితి (ambivelence) కొంత మంది తల్లులు పిల్లలకు అన్నీ తామే చేసిపెడతారు. అలాంటి పిల్లలు తల్లుల మీద ఆధారపడడం ఎక్కువై స్వతంత్రంగా ఏపనీ చేసుకోలేరు. అలాంటి వారు ఈవియోగ వ్యాకులత (Separation anxiety)కు ఎక్కువగా గురవుతారు అలాకాక మరి కొంతమంది తల్లులు తమ పిల్లలకు స్వతంత్రంగా ఎదిగే అవకాశం కల్పిస్తారు అవసరమైనప్పుడు మాత్రమే తల్లి పిల్లవానికి అందుబాటులో ఉంటుంది. మిగతా సమయాలలో పిల్లవాడు తన నిర్ణయాలు తానే తీసుకొంటూ ముందుకు సాగిపోతాడు. అలాంటి పిల్లలను ఈ వియోగ వ్యాకులత అంతగా బాధించదు.

కొంత మంది మనోవిశ్లేషకులు ఏమంటున్నారంటే, తల్లితోడి పిల్లవాడి అనుభవాలు సజావుగా లేకుండి, తండ్రి ఆ పరిస్థితులను సరిదిద్ద లేనప్పుడు, ఆ పిల్లవాడు పెరిగి పెద్దైన తరవాత కూడా జీవితాంతం అతనిని వ్యాకులత విడిచి పెట్టదు. ఇటువంటి వ్యాకులత రెండు రూపాలను తీసుకొంటుంది 1. ఉన్న చోటును పరిచిత వ్యక్తులను వదిలిపోలేని అతి ఆలంబన. 2 ఉన్న చోట నిలదొక్కుకోలేక ఎండమావిలో ఆదర్శసన్ని వేశం కోసం పదే పదే ఆస్థలాన్ని వదిలి పెట్టిపోవడం పిల్లవాని మూర్తిమత్వం (Personality) రూపొందడంలో తల్లిదండ్రుల పాత్రే కాక ఇంకా అనేక కారకాలున్నాయి. పిల్లలు పెద్దవారైన తరవాత జీవితాల్లో జరిగే వీడుకోలు సన్నివేశాలను వారు ఎలా ఎదుర్కొంటారనేది చిన్ననాటి వియోగ అనుభవాల (Separation experiences) మీద ఆధారపడి ఉంటుందని మనో విజ్ఞాన శాస్త్రజ్ఞులు వాకొంటున్నారు.

వియోగ అనుభవాలు, ఏ అనుభవానికి ఆ అనుభవం విడివిడిగా ఉండక అవన్నీ సంచితం (cumulative) అవుతాయి ''లీవ్ టేకింగ్'' అనే గ్రంథానికి సహరచయిత అయినా డా॥మోర్టైమర్ ఫెయిన్ బెర్గ్ ఇలా అంటున్నాడు: బాధాకరమైన వ్యాకులత వేర్పాటు అనుభవాలకు గురైన బిడ్డ పెద్దవాడైన తరవాత ప్రతి సంబంధానికి అతిగా అంటుకుపోతాడు లేదా అసలు ఇతరులతో సంబంధాలనే పెట్టుకోలేడు.

సంబంధాలకు అతిగా అంటి పెట్టుకోవడం అంటే వాటిని పట్టుకు వేళ్లాడడం లేదా అసలు సంబంధాలే ఏర్పాటు చేసుకోలేక పోవడం అంటే పలాయనం చిత్తగించడం ఈ రెండు ప్రవృత్తులకు బ్రిటిష్ సైకియాట్రిస్ట్ డా॥ బాలింట్ నామకరణం చేశాడు. మొదటి ప్రవృత్తి

అక్నోఫైల్ (Ocnophile) - అంటే ''ఆలంబన ప్రేమికుడు ''అని, రెండో ప్రవృత్తి గల వానిని ఫిలోబాట్ (philobat) అంటే '' సాహస ప్రేమికుడు'' అని పేర్లు పెట్టాడు. ఆలంబన ప్రేమికుడు భద్రతకు స్థిరత్వానికి అంటుకుపోతాడు. వ్యక్తులకు, స్థలాలకు, వస్తువులకు అతిగా బద్ధుడైపోతాడు. పైగా ఒంటరిగా ఉండలేడు. సాహస ప్రేమికుడు ( త్రిల్స్‌ను ప్రేమించేవాడు) బంధాలను పెట్టుకోవడానికి ఇష్టపడడు. సాహసోపేతమైన అనుభవాల కోసం అర్రులు చాస్తాడు. యాత్రలు చేస్తాడు కొత్త రుచులు, కొత్త అనుభవాలు కావాలంటాడు. మనుష్యులను, వస్తువులను తేలికగా ఏమీ బాధలేకుండా వదిలివేస్తాడు.

అయితే మనలో చాలామందిమి పూర్తిగా ఈ కోవకో ఆకోవకో చెంది ఉండము. అనేక పాళ్ళల్లో రెండూ మనలో మిళితమయ్యే ఉంటాయి. కొంత మంది మాత్రం పూర్తిగా ఈ కోవకో ఆకోవకో చెంది ఉంటారు. తగు పాళ్ళలో రెండూ మిళితమై ఉన్నప్పుడు జీవితంలో అనేక సన్నివేశాలలో సందర్భోచితంగా ప్రవర్తిస్తాం.

ఇందులో విరోధాబాస ఏమిటంటే, వీడ్కోలు. ''పరిపక్వత''కు అభివ్యక్తిగానూ పరిగణించవచ్చు. జీవితం మీద ''శైశవ దృక్పథం'' గాను చూడవచ్చు. తరచుగా వీడ్కోలు చెప్పడాన్ని సాన్నిహిత్యాని (intimacy) కి భయపడి పారిపోయే పలాయనం కంటె ధైర్యంతో కూడిన సాహస కృత్యంగా పరిగణించవచ్చు. ఇలాంటి సందర్భాలలో ఇదా అదా అనే తికమక ఏర్పడుతుంది వీడ్కోలు తీసుకోవడానికి భయ కంపితులైన కొందరు, వాస్తవానికి వారు అంతరాంతరాలల్లో పిరికి వారైనా, పైకి నిబ్బరంగా, స్థిరచిత్తులుగా, ఆధారపడ దగిన వారుగా కనిపిస్తారు.

ఎప్పుడు వీడ్కోలు దుర్భరంగా ఉంటుంది? ఎప్పుడు పరిణతను ప్రదర్శిస్తుంది? ఏది ఏదో తెల్సుకోవడానికి డా॥ బాలింట్ సిద్ధాంతం కొన్ని కొండ గుర్తులను చెబుతుంది సాహస ప్రేమికుడు దేనికీ కట్టుబడిపోడు. అతని కమిట్‌మెంట్స్‌లో డొల్ల ఉంటుంది అవి దీర్ఘకాలం ఉండవు దారిలో ఎదురైన వారినందరిని ప్రేమించుకొంటూ పోతాడు. వెనక వారిని వెనకే వదిలివేస్తాడు. అలాగే ఉద్యోగాలు ఎన్నో మారుస్తాడు పాతవాటిని త్యజిస్తాడు. కొత్తవాటిని కౌగిలించుకొంటాడు ఇహ ఆలంబన ప్రేమికుని విషయానికి వస్తే, అతడు ఎవరి మీదనైతే భద్రత కోసం ఆధారపడతాడో ఎవరు నిరంతరం తనను త్యజించమని హామీలనిస్తారో, వారి మీద పట్టు కోసం ప్రాకులాడతాడు. ఈ ప్రేమికునికి ఆప్రేమికునికి మధ్యలో చాలమంది వివిధ స్థాయిలలో ఉంటారు. వీరిలో వీడుక్కోలు వివిధ స్థాయిలలో ప్రతి చర్యా ప్రతిస్పందనను రేకెత్తిస్తుంది.

చిన్న తనంలో తల్లి దండ్రుల నుంచి జరిగే వేర్పాటు ఘాతుకంగా ఉండవచ్చు. అలాంటి వాళ్ళకు తరువాత జీవితంలో వీడ్కోలు సందర్భాలు అంతటి ఆఘాతాన్ని - నిస్సహాయత, కోపం, దుఃఖాలను - తిరిగి కలిగిస్తాయి. విచిత్రం ఏమిటంటే, ఇచ్ఛికంగా తీసుకొనే వీడ్కోళ్లు కూడా ఎంతో ఎడబాటు అనుభూతిని కలిగిస్తాయి. ఎవరో వెంటాడి తరిమినట్లు, అయిన వాళ్ళంతా కాదని తరిమి వేసినట్లు అనుభూతి మిగులుతుంది. అంతేకాదు వీడ్కోలు తీసుకొన్నవారికి అవాంఛనీయులైనట్లు భావన కలుగుతుంది.

వలస లాంటి పెద్ద ''స్థానచలనం'' కలిగినప్పుడు కొత్తచోట కొత్తముఖాల్లో నమ్మదగిన వారి కోసం వెతుక్కొంటాం. ఈ వెతుకులాట ఎలా ఉంటుందీ అంటే, పిల్లవాణ్ణి ఒంటరిగా వదిలి వేసినప్పుడు అతడు నిరాశానిస్పృహలతో బిక్కు బిక్కుమంటూ పరిచిత మాతృముఖం కోసం అన్వేషిస్తున్నట్లుగా ఉంటుందంటారు గ్రిన్స్‌బెర్గ్‌లు అటువంటి సందర్భంలో ఎవరైన ఎదురై విశ్వాసాన్ని మార్గనిర్దేశాన్ని అందించ గలిగితే అతనికి ఊరట కలుగుతుంది.

ఒక వ్యక్తిని, స్థలాన్ని వదిలి పెట్టినప్పుడు ఏదో పోగొట్టుకొన్న భావన, దుఃఖం నిత్య జీవితంలో తరచు కలుగుతూనే ఉంటాయి. కాని మనం ఇవి జీవితంలో అంత తరుచుగా జరుగుతుంటాయంటే అంగీకరించం. ఇటువంటి సందర్భాలలో మొదట కొంత కాలం పాటు వదిలి వచ్చిన స్థలాన్ని, వ్యక్తులను మరిచిపోలేము. కాలం గడిచే కొలది పాతవి విస్మృతాలై, నూతన విషయాలలో మునిగిపోతాము. ఏదశలో అయితే వ్యక్తి తాను వదిలి వచ్చినది స్వర్గమనీ, దానికి తిరిగిపోవాలనీ భావించడం మాని వేస్తాడో, అప్పుడు అతడు పరిపక్వత వైపుకు మళ్ళుతున్నాడని గ్రిన్స్‌బర్గులు అంటున్నారు.

చాలా మంది మనో విశ్లేషకులు (Psychoanalysts) వీడ్కోలును తమ చికిత్సలో కేంద్రక సమస్యగా భావిస్తున్నారు. ఒక చికిత్స ఎప్పుడు విజయవంతంగా పూర్తి అయినట్లు? ఎటువంటి కీలక బంధాన్నైనా ఒక విధమైన పరిణతతో తెంచుకోగలిగినప్పుడు అది ఎటు వంటి పరిణత అయి ఉండాలంటే, బాల్యం నుంచి వెన్నాడుతూ వచ్చే అపరిష్కృత అవసరాలు, వాంఛలు (unresolved needs and longings) ను తృణప్రాయంగా తీసివేయగలిగినదై ఉండాలి.

చికిత్స విజయవంతంగా పూర్తి అయినప్పుడు, ముగింపు వ్యక్తి జీవితంలోని ప్రతి ఘట్టం నుంచి అనేక అనుభూతులను ముప్పిరిగొనేట్టు చేస్తుందంటాడు స్టీఫెన్ ఫైర్‌స్టెయిన్ అనే మనో విశ్లేషకుడు రోగికి తన బాల్యంలోని ఆశలకు, ఆశంసలకు, స్వైరకల్పనలకు, అనుభవాలకు, అనుభూతులకు, వాంఛలకు, కీలక వ్యక్తులకు విశ్లేషకుడు ప్రతీక అవుతాడు. చికిత్స పూర్తి అయినప్పుడు, '' ఎలాగైన తన చిన్న నాటి ఆశంసలను విశ్లేషకుడు తీరుస్తాడు'' అనే స్వైర కల్పనను రోగిత్యజించాల్సి ఉంటుంది. ఇంత కాలంగా తాను పెంచుకొన్న ఆశంసలు, ఆశలు తీరనివి అని, తీరడం అసంభవమని గుర్తించడం రోగి సమస్య చికిత్స అయిపోయిన తరవాత తీరని ఆశల వల్ల జనించిన కుంఠనం, నిరాశానిస్పృహలను నిజాయితో అంగీకరించి, వాటికి బదులు వయోజనునికి తగిన అనుభూతులను సంతుష్టులను రూపొందించు కోవాలి. ఉదాహరణకు విశ్లేషకుడు తన మీద చూపే శ్రద్ధను రోగి తన బాల్యంలో తల్లి తనపై చూపిన శ్రద్ధతో సమంచేసి చూస్తాడు చికిత్స ముగిసిన తరవాత, వాస్తవ ప్రపంచాన్ని ఎదుర్కొంటాడు. ఈ వాస్తవ ప్రపంచంలో, ఇక ఎప్పటికి తన చిన్ననాటి ఆశలు తీరవని, గతాన్ని పునః సృష్టిచేయడం అసంభవమనీ తెలుసుకొంటాడు. ఈ దృష్టితో చూసినప్పుడు మనోవిశ్లేషణ అంటే ''వేరు పడడాన్ని'' (Separation)నేర్చు కోవడమే నంటాడు, డా॥ ఫోజెల్.

ఆధునికి జీవితంలో, ముఖ్యంగా అమెరికా లాంటి దేశాల్లో ఉద్యోగాల మార్పిడి - పదోన్నతి కావచ్చు - ఎక్కువగా ఉంటుంది ఇవన్నీ ఎడబాటు కలిగించేవే. ఏ ఎడబాటైనా బాల్యంలో జరిగినఎడబాట్లను- ఉదాహరణకుమొదటిరోజు స్కూలుకు వెళ్ళడం లాంటివి - పునశ్చరిస్తాయి. నాటి ఎడబాట్లు భావి ఎడబాటకు రూపురేఖలు కల్పిస్తాయి.

ఒకచోటు నుంచి మరోచోటుకి మారడం అంటే, నీకు పరిచితమైన భద్రతకల్పించిన సన్నివేశాలను, మనుషులను, రోజూ నీవుచేసే దైనందిన కృత్యాలను ఒక్కసారిగా వదిలిపెట్టి, ముక్కూమొహం తెలియని, అనిశ్చిత ప్రపంచంలోకి మనుషుల మధ్యకు అడుగిడడం. అటువంటి మార్పు, నీవు ఎంతగా కోరుకొన్నదైనా, కొంత అలజడిని, వ్యాకులతకు కలిగించకమానదు.

ఉద్యోగాల మార్పిడి లాంటి ఇంకా ఇతర ఎడబాట్లు కలిగే వారికి డా॥ ఫెయిన్ బర్గ్ ఇలా సలహా ఇస్తారు

1. నీకు అనేక సంశ్లిష్ట ఉద్వేగాలు (Complex emotions)ఉంటాయని గుర్తించు. నీవు చేసే

ప్రతి చర్యల నన్నింటినీ నీవు అదుపుచేయలేవని కూడా గుర్తించు. అవి తొలి జీవితపు అనుభవాల ఊటబుగ్గల నుంచి ఊరివస్తాయి.

2. కొన్ని పరితాపాలు తప్పవు ''నేను ఆ ఉద్యోగం వదిలి ఉండ వలసింది కాదు,'' అనే ఆలోచనలు వస్తాయి. ఇది ఎడబాటులోని ద్విసంవేగస్థితి (ambivalence)ని సూచిస్తాయి

3 నీ బంధాలను మెచ్చుకో ఒకసారి ఉన్న ఉద్యోగాన్ని వదిలి మరో ఉద్యోగానికి పోవాలను కొన్నప్పుడే, నిజంగా నీవు ప్రస్తుతం చేస్తున్న ఉద్యోగానికి నీ మీద ఎంత పట్టు ఉందో అర్థం అవుతుంది అంటే ఆ ఉద్యోగంలో నీకు ఏర్పడిన స్నేహానుబంధాల, దిన చర్యల పట్టు నీమీద ఎంత ఉందో అప్పడే అర్థమవుతుంది.

4 మార్పిడి అనైచ్ఛికం అయితే పగతీర్చుకోవడానికి ప్రయత్నించకు. కోపం వినాశకర ఉద్వేగం. పగతీర్చుకోవడానికి ప్రయత్నిస్తున్నావంటేరెండు గోతులు (సమాధులు) తవ్వుతున్నావన్న మాట. ఇది సామెత.

5. అది అలా ఉండనీయండి నీవు లోగడ వాళ్ళతో కలిసి పని చేశావనే మిష మీద వాళ్ళతో సంబంధాలు కొనసాగించాలని ప్రయత్నించకు. పని కంటె భిన్నంగా వారితో నీకున్న స్నేహం కారణంగా వాళ్ళతో సంబంధాలు కొనసాగించు.

ఇహ ప్రేయసీ ప్రియుల ఎడబాటుకు వస్తే అందులో కూడా చాల వరకు మనం పైన చెప్పిన విషయాలే ఇమిడి ఉంటాయి. ప్రేయసీ ప్రియుల బంధం అంటే అది చాల చిక్కగా ఉంటుంది వారి మధ్య ఎడబాటు తప్పకుండా గాఢనిర్నిరోధ ఉద్వేగాలను ఉపరితలానికి తీసుకు వస్తుంది. అటువంటి బంధాలు, చాలమంది మనోవైజ్ఞానికుల దృష్టిలో మనోవిజ్ఞాన పరంగా వ్యక్తుల అత్యంత తొలి బంధాలను ఈ బంధాల ననుసరించిన అవసరాలను, అనుభూతులతో సహా పునః సృష్టిస్తాయి. అటువంటి వారు విడాకులు తీసుకోవలసివచ్చినా, దూరం కావలసి వచ్చినా, అప్పుడు జరిగేది బాల్య వియోగ వ్యాకులత (Separation anxiety of child hood)ను తిరిగి అనుభవించడమే. ఆ అనుభవంతో పరిత్యాగాను భూతి, బాధ, నిస్సహాయత, కోపం ఉంటాయి.

అన్ని ఉద్వేగాలతోపాటు విడాకులలో ఒకరకం అపరాధ భావన కూడా ఉంటుందని బెర్నార్డ్ బ్లూమ్ అంటాడు. ఎన్నో విడాకుల కేసులను పరిశీలించిన తరవాత, "ఈ వియోగంలో ఒక సార్వజనీనమైన గాఢ పరితాపం ఉంది ఇలా చేయకుండా అలా చేస్తే మరో విధంగా జరిగి వుండేది'' అని అనుకొంటారు.

విడాకులు తీసుకొన్న వారు, ఇంకా ఇప్పటికీ తమ గత జీవిత భాగస్వాములతో ఎంతో గాఢాను రక్తులై ఉన్నారనే విషయాన్ని ఒప్పుకోవడానికి, ఇష్టపడరు. పైగా తాము ద్వే షిస్తున్నా మంటారు కూడా. వీలైతే మళ్ళీ కలిసి పోవాలనే వాంఛ ఎక్కడో అంతర్లీనంగా తిరుగాడుతూ ఉంటుంది. పూర్తిగా ఒకరి నొకరు మరిచి పోవడానికి మూడు సంవత్సరాలైన పడుతుంది

వైవాహిక జీవితంలో పరస్పరాలంబన నమ్మరానంత ఎక్కువగా ఉంటుంది. బట్టలు ఉతికి ఇస్త్రీ చేయించుకొనే దగ్గర నుంచి అత్యంత గాఢ ఉద్వేగావసరాల వరకు ఇది వ్యాపించి ఉంటుంది. కేవలం ఒంటరి తనంతో బాధితులై పెళ్ళిచేసుకొంటే ఆ వివాహం అంతం కావడమే మంచిది అందులో సకారాత్మక బంధాలు ఏమిలేవు వారిని కలిపింది కేవలం ఒక్క ఒంటరితనమే

ఎవరైన దంపతులు వివాహ బంధాన్ని తెంచుకోవాలని ఆలోచిస్తున్నప్పుడు, వారికి నా సంహా ఒకటి ఉంది అంటాడు డా॥ బ్లూమ్ '' తప్పు ఎక్కడ దొర్లిందో వారిద్దరు కూర్చొని విశ్లేషించుకోవాలి ఏదైన సమస్య ఉంటే ఇద్దరు చర్చించుకొని పరిష్కారం కనుక్కోవాలి ఈ పని కనుక వారు చేయక పోతే, తరవాతి వివాహం అంతకంటె బాగుండదు. మొదటి వివాహ సమస్యలను పరిష్కరించక పోతే, అవే సమస్యలు వారిని రెండో వివాహంలోనూ వెంటాడతాయి



చిత్రం : శక్తి

చిత్రకారుడు : - భరద్వాజశాస్త్రి, గిద్దలూరు.

